# జనరల్ సైన్స్

## అన్ని రకాల పోటీ పరీక్షలకు

ముత్యాల ప్రసాద్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

GENERAL SCIENCE – By Mutyala Prasad

విశాలాంధ్ర ప్రచురణాలయం (1953-2003) స్వర్ణోత్సవ ప్రచురణ
ప్రచురణ నెం. : 2350/2219 2R
ప్రతులు : 1000
ప్రథమ ముద్రణ : జనవరి, 1993
ద్వితీయ ముద్రణ : డిసెంబరు, 1994
తృతీయ ముద్రణ : జూన్, 1996
చతుర్థ ముద్రణ : జులై, 2000
పంచమ ముద్రణ : మే, 2003
షష్ఠ ముద్రణ : ఫిబ్రవరి, 2005


ముఖ పత్రం : రాజా

వెల: రూ.50-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001
E-Mail: visalaandhraph@yahoo.com

విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్/సుల్తాన్ బజార్) - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.



ముద్రణ విశాలాంధ్ర ప్రెస్, హిమాయత్‌నగర్, హైదరాబాద్, ఫోన్ నెం. 23222308.

# ఒక మాట...

ఇది పోటీ ప్రపంచం. అన్ని రంగాలతోపాటు విద్యారంగంలో, ఉద్యోగాన్వేషణలోనూ పోటీ విపరీతంగా పెరిగింది. నిత్యం ఎన్నోరకాల ఉద్యోగాలకు పోటీ పరీక్షలు జరుగుతున్నాయి ఈ పోటీలలో విజయం సాధించడానికి తగిన విషయ పరిజ్ఞానాన్ని అందించగలిగిన పుస్తకాల కొరత తెలుగులో చాలా ఎక్కువగా వుంది.

ఈ నేపథ్యాన్ని దృష్టిలో వుంచుకుని ఈ పుస్తకానికి రూపకల్పన చేయడం జరిగింది. శాస్త్ర, సాంకేతిక రంగాలలోని సంఖ్యానేకమైన అంశాలకు సంబంధించిన పరిజ్ఞానాన్ని ఇందులో పొందుపరచే ప్రయత్నం జరిగింది.

విద్యార్థులు పలురకాల పోటీ పరీక్షలకు హాజరయ్యేవారు విజయపథంలో పురోగమించడానికి ఇది కరదీపికగా ఉపయోగపడాలని మా ఆశంస.

ఈ పుస్తకాన్ని ముద్రించి మీ ముందుకు తెస్తున్న విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారికి కృతజ్ఞతలు.

—ముత్యాల ప్రసాద్

# ఇదీ క్రమం...

# విశ్వసృష్టి ఆద్యంతాల మధ్య అనంతకాలయాత్రలో...

"మెదడన్నది మనకున్నది
అది సరిగా పనిచేస్తే
విశ్వరహః పేటికా వి
పాటన జరగక తప్పదు."

అని మహాకవి శ్రీశ్రీ ఒక కవితలో పేర్కొన్నారు.

పదార్థ ఆవిర్భావం జరిగి మానవుడు రూపొంది క్రమ క్రమానుగత చైతన్య విలసితుడవుతున్న నాటి నుంచి తన చుట్టూ వున్న ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకోడానికి అనేక కల్పనలు చేశాడు. భ్రమలకూ, వాస్తవాలకూ మధ్య తేడా తెలియని, తెలుసుకోలేని ఆదిమ కాలంలోనే మనిషి ప్రకృతినీ, ప్రకృతి నియమాల్నీ, విశ్వరహస్యాల్నీ తనకున్న పరిమితులలోనే వ్యాఖ్యానించి నిర్వ చించే ప్రయత్నం చేశాడు.

అనంతమూ, అపారమూ అయిన ఈ విశ్వసృష్టికి మూలం ఏమిటి? నదీ నదాలు, సముద్రాలు, మహాసాగరాలు, కొండలు, బిలాలు. అగ్నిపర్వతాలు ఎలా జనించాయి? దివారాత్రాల కాల చక్ర పరిణామాన్ని శాసించుతున్న నియ మాలు ఏమిటి? నక్షత్రాలకు మూలమేమిటి? గ్రహగతుల పూర్వాలకు అర్థం ఏమిటి? సృష్టికీ, కాలానికీ, శూన్యానికి మధ్య వున్న అనుబంధం ఏమిటి?

అభివృద్ధి చెందుతున్న మానవుడి ముందు ఇలా ఎన్నో ప్రశ్నలు నిలిచాయి.

"చారిత్రక విభాత సంధ్యల
మానవకథా వికాసమెట్టిది?"

అని తనను తాను ప్రశ్నించుకున్నాడు. జవాబుల అన్వేషణకు ఉపక్రమించాడు. అగ్నిని సృజించడంతో ఆరంభమైన విజ్ఞానశాస్త్రం క్రమక్రమంగా పురోగమించి

చక్రాన్ని కనిపెట్టడంతో మానవాళి పురోగమనం మరింత వేగవంతం అయింది. ఆనాటి నుంచి ఈనాటి వరకూ మనిషి ప్రశ్నలకు జవాబులు అన్వేషిస్తూనే వున్నాడు. ప్రకృతిని శాసించడానికి ప్రయత్నిస్తూనే వున్నాడు.

బృహత్తర అన్వేషణలో, మహత్తర కార్యసాధనలో ఎదురైన ఆటంకాలు, అపజయాలు ఏవీ శాస్త్రవిజ్ఞాన పురోభివృద్ధిని నిరోధించలేకపోయాయి.

మహా విస్ఫోటం జరిగి సౌరకుటుంబం ఏర్పడటానికి దారితీసిన నాటి నుండి కాలం నడిచిన అడుగుజాడల్ని గుర్తించేందుకు జరిగిన అన్వేషణలో లభ్యమైన జ్ఞాన సమాహార సంక్షిప్త రూపమిది. ఇక చదవండి!

శూన్యం దగ్గర నుంచి కాలం ప్రారంభం అయింది. తర్వాత సెకండులో.

$10^{-43}$ భాగంలో ఉష్ణసమస్థితి నుండి గురుత్వాకర్షణ శక్తి వెలువడింది.

$10^{-30}$ సెకండులో ఎంతో వేగంగా విశ్వం విస్తరించసాగింది.

$10^{-30}$ సెకండ్ : విశ్వ విస్తరణ ఆగిపోయింది. శూన్యంలోని అణువులు దగ్గరవసాగాయి.

$10^{-11}$ సెకండ్ : అణువుల మధ్యగల బలహీనమైన విద్యుత్‌శక్తి వికలమై విద్యుదయస్కాంత శక్తిగా, అణుశక్తిగా మారింది.

$10^{-6}$ : $10^{-5}$ సెకండ్ : అణువుల గర్భంలోని ప్రోటానులు, న్యూట్రానులు ఏర్పడడానికి మూలకారణమైన క్వార్క్‌లు అనే ఉపాణువులు ఒక దానిని ఒకటి చంపుకోవడం ఆపి, ఎలక్ట్రానులుగా, ప్రోటానులుగా ఏర్పడసాగాయి. ఇవే అణువులు అవతరించడానికి ప్రాతిపదిక లయ్యాయి.

$10^{-4}$ : ఇప్పటికి మనం ఎరిగిన విశ్వం వయస్సు 1/10,000 వంతు సెకండు. ఈ కాలంలోనే కోటానుకోట్ల ఎలక్ట్రానులు, ప్రోటానులు, న్యూట్రానులు శూన్య రోదసిలో చెదిరిపోయాయి. మరికొన్ని అణు రూపాలను ఏర్పరచుకొన్నాయి.

$10^{-2}$ సెకండ్ : ద్రవ్యరాశిలోని రేణువులు ఉష్ణబంధాల్ని ఏర్పరచుకొని నిర్దిష్ట రూపంలోకి రాసాగాయి.

1 సెకను : ఇతర రేణువులతో కలిసి ఉన్న న్యూట్రానులు విడిపోయి స్వతంత్రంగా వెళ్ళిపోయాయి.

3 నిమిషాల 42 సెకండ్లు : ప్రోటానులు, న్యూట్రానులు దగ్గరై హీలియం అణుగర్భాలు (న్యూక్లియస్)గా ఏర్పడసాగాయి. ఇప్పటికి విశ్వం 20 శాతం హీలియం 80 శాతం హైడ్రోజన్‌తో నిండింది.

1 గంట : అణుమార్పిడి జరగకుండా ఆగిపోయే దశలో విశ్వం చల్లబడి పోయింది.

1 సంవత్సరం : నక్షత్ర గర్భంలోని ఉష్ణోగ్రతతో సమానమైన ఉష్ణోగ్రత విశ్వంలో నిలిచింది.

$10^{-6}$ సంవత్సరాలు : వైశ్విక రేడియో ధార్మికత అవిర్భవించింది. స్థిరంగా ఉన్న అణుగర్భాలలోని ఎలక్ట్రానులు యితర అణువులతో సంయోగించే మార్పు వచ్చింది. ఈ దశలోనే పదార్థం నక్షత్ర మండలాలుగా, నక్షత్రాలుగా మారిపోయే ప్రక్రియ ప్రారంభం అయింది.

$10^{-9}$ సంవత్సరాలు : కాలం ప్రారంభం అయి ఇప్పటికి 17 బిలియన్ సంవత్సరాలయింది. ఈ సమయంలో గెలాక్సీల పూర్వాపరాలు ప్రారంభం అయాయి. నేటికి పూర్వం 4.5 బిలియన్ సంవత్సరాల నాడు వాయు, ధూళి మేఘం (ఆది మేఘం) నుంచి సూర్యుడు, గ్రహాలు జన్మించాయి. సర్పిలాకారంలో పాలపుంత నక్షత్రమండలానికి ఒక చేతివైపున యివి జన్మించాయి

3.8 బిలియన్ సంవత్సరాలు : భూమి చల్లబడింది.

3.5-3.2 బిలియన్ సంవత్సరాలు : భూమిపై సూక్ష్మజీవులు అవతరించాయి.

1.8-1.3 బిలియన్ సంవత్సరాలు : భూమిపై మొక్కలు ఏర్పడ్డాయి. భూవాతావరణాన్ని ఆక్సిజన్ విషవాయువు ఆవరించింది. కాలక్రమంలో ఆక్సిజనని పీల్చే జీవులు ఏర్పడ్డాయి.

900-70 మిలియన్ సంవత్సరాలు : జీవులలో లింగభేదం వచ్చింది. జీవ పరిణామం వేగవంతం అయింది.

700 మిలియన్ సంవత్సరాలు : జంతువులు — జెల్లీఫిష్ వంటివి అవతరించాయి.

600 మిలియన్ సంవత్సరాలు : పీత జాతి జంతువులు ఏర్పడ్డాయి.

500 మిలియన్ సంవత్సరాలు : వెన్నెముక జాతి జంతువులు వచ్చాయి.

425 మిలియన్ సంవత్సరాలు : ఇంత వరకు నీటిలో జీవించిన జంతువులు భూమిపైకి వలస ప్రారంభించాయి.

395 మిలియన్ సంవత్సరాలు : తొలి దశ కీటకాలు.

325 మిలియన్ సంవత్సరాలు : భూమిపై నివసించే తొలిదశ వెన్నెముక జంతువుల ఆవిర్భావం.

200 మిలియన్ సంవత్సరాలు : క్షీరదాలు వచ్చాయి.

180 మిలియన్ సంవత్సరాలు : ఆఫ్రికా ఖండం నుంచి ఉత్తర అమెరికా విడిపోయింది. అట్లాంటిక్ సముద్రం ఏర్పడింది.

70 మిలియన్ సంవత్సరాలు : కోతిజాతి ఆవిర్భావం.

55 మిలియన్ సంవత్సరాలు : తొలి గుర్రం జాతి ఆవిర్భావం.

35 మిలియన్ సంవత్సరాలు : పిల్లులు, కుక్కలు వచ్చాయి.

24 మిలియన్ సంవత్సరాలు ; గడ్డి మొలిచింది.

21 మిలియన్ సంవత్సరాలు : కోతులలో కొన్ని జాతులు జీవపరిణామం జరిగి మార్పు చెందాయి.

20 మిలియన్ సంవత్సరాలు : వాతావరణం ఆధునిక రూపాన్ని ఏర్పరచుకొన్నది.

15 మిలియన్ సంవత్సరాలు : అంటార్కిటికా ఖండం ఘనీభవించింది.

11 మిలియన్ సంవత్సరాలు : గడ్డిమేసే జంతువులు విస్తరించాయి.

5 మిలియన్ సంవత్సరాలు : చింపాంజీ వర్గం నుంచి కోతిమానవుడు (నరమానవుడు) ఆవిర్భవించాడు.

3.7 మిలియన్ సంవత్సరాలు : కోతి మనిషి నిటారుగా నడవసాగాడు.

3.5 మిలియన్ సంవత్సరాలు : కొత్త హిమయుగం.

1.8–1.7 మిలియన్ సంవత్సరాలు : చైనాలో అసలు సిసలు మనిషి అవతరణ.

6 లక్షల సంవత్సరాలు : మానవజాతి వికాసం విస్తరణ.

360,000 సంవత్సరాలు : నిప్పు కనుగొన్నారు.

1,50,000 సంవత్సరాలు : ఉన్ని మృగాల సంచారం

100,000 సంవత్సరాలు : నక్షత్రాలు ఆధునిక నక్షత్ర మండలాలుగా పునర్వికాసం.

40 వేల సంవత్సరాలు : సంక్లిష్ట భాష ఆధునిక మనిషి.

35 వేల సంవత్సరాలు : నియాన్ డెర్తాల్ మనిషి అదృశ్యం అవడం. సంగీత పరికరాలు.

20 వేలు – 15 వేల సం॥ : వ్యవసాయం ఆరంభం.

19 వేల సంవత్సరాలు : అమెరికాలో జనవాసాలు.

18 వేల సంవత్సరాలు : పశుపోషణ.

14 వేల సంవత్సరాలు : చేపల్ని పట్టే కాలం.

13 వేల సంవత్సరాలు : పింగాణీ పాత్రలు.

10 వేల సంవత్సరాలు : వరి, గోధుమ సేద్యం.

6,700 సంవత్సరాలు : బాబిలోనియా కేలండర్.

6,200 సంవత్సరాలు : సౌర పంచాంగం.

6,500 సంవత్సరాలు : రాగి
5,600 సంవత్సరాలు : వస్త్రాలు
5,500-3,500 సంవత్సరాలు : వ్రాత లిపి అభివృద్ధి
క్రీస్తు పూర్వం 3,600-3,400 : పెరూ, మెక్సికోలలో ప్రత్తిసాగు.
2,500 : రాతి నిర్మాణాలు
2,200 : ఇండియా, చైనా, ఈజిప్టు, బాబిలోనియాలలో ఖగోళ పరిశోధనలు.
1500 : ఈజిప్టులో సౌర గడియారం
1000 : హోమర్ చే ఒడెస్సీ గ్రంథం
800 సంవత్సరాలు : మెక్సికో నాగరికత
650 సం॥ గ్వాటిమాలాలో మయ సంస్కృతి
600 సం॥ లావోజు, కన్ఫ్యూషియస్! బుద్ధుడు, జొరాస్టర్, హీబ్రు భాషలో పాత గ్రంథం.
540 సం॥ పైథాగరస్ సిద్ధాంతం
450 సం : అణు నిర్మాణం గురించి లుసిపస్ సిద్ధాంతాలు.
400 సంవత్సరాలు : ప్లేటో బోధనలు, అరిస్టాటిల్ ఇడోక్సస్‌ల సిద్ధాంతాలు.
300 సం : యూక్లిడ్స్ జామెట్రి
260 సం : అరిస్టార్కస్ సూర్యకేంద్ర సిద్ధాంతం.
100 సం : క్లాడియస్ టాలెమీ - భూకేంద్ర సిద్ధాంతం. చైనా నావికులు ఇండియా చేరారు.
60 సం : లొక్రిషియ "ఆన్ ది నేచర్ ఆఫ్ థింగ్స్" రచన.

# క్రీస్తుశకం

325 : అబ్రహాం జననానికి ముందు 3,184 సంవత్సరాల నాడు ఈ ప్రపంచం సృష్టించబడినదని యుసిబియస్ లెక్కలు వేశాడు.

400 : చీకటి యుగపు మధ్యకాలం ప్రారంభం. పశ్చిమ దేశాలలో విజ్ఞాన శాస్త్రం కన్ను తెరచింది.

455 : రోమ్‌ని దుండగులు ఆక్రమించారు.

963 : అదిమ మేఘాలు గురించి అల్ సుఫీ తన గ్రంథం "బుక్ ఆఫ్ ది ఫిక్సెడ్ స్టార్స్"లో వర్ణించాడు.

1001 : లీఫ్ ఎరిక్‌సన్ న్యూ ఇంగ్లండ్ చేరాడు,

1276 . 1292 : మార్కోపోలో సాహసాలు.

1400 : యూరప్ పునరుజ్జీవ ఉద్యమం

1492 : కొలంబస్ అమెరికాని (తిరిగి) కనుగొన్నాడు.

1522 : మేజిల్లాన్ బృందంచే భూప్రదక్షిణం పూర్తి.

1543 : కోపెర్నికస్ వ్రాసిన 'ఆన్ ది రివల్యూషన్స్' గ్రంథం ప్రచురణ.

1572 : ఆకాశంలో కొత్త నక్షత్రాల్ని టైకోబ్రాహి కనుగొన్నాడు.

1604 : వస్తువులు సమాన వేగంతో ఒకేసారి కిందకు పడతాయని గెలీలియో మొట్టమొదటిసారిగా నిరూపించాడు. కెప్లర్ గెలీలియో మొదటిసారి నక్షత్ర విస్ఫోటనం చూశారు.

1600 : టెలిస్కోపు ద్వారా గెలీలియో మొట్టమొదటిగా చీకటి రాత్రి ఆకాశాన్ని చూశాడు. గ్రహాలు అండాకార కక్ష్యలో తిరుగుతున్నాయిని కెప్లర్ నిరూపించాడు.

1611 : క్రీస్తు పూర్వం 4004 వ సంవత్సరం అక్టోబరు 23 వ తేదీన కాల గణన ప్రారంభం అయినదని బైబిల్ కింగ్ జేమ్స్ ప్రతికలో వెల్ల డించాడు.

1616 : భూమి చలిస్తున్నదని వ్రాసిన అన్ని పుస్తకాలను కాథలిక్ చర్చి నిషేధించింది.

1639 : శుక్ర గ్రహపు చలనంలో ట్రాన్సిట్ స్థితిని బ్రిటన్‌కు చెందిన ఇద్దరు యువ ఖగోళవేత్తలు గుర్తించారు.

1662 : లండన్‌లో రాయల్ సొసైటీ అవతరణ.

1665 - 1666 : ఇరవై మూడేళ్ళ ఐజాక్ న్యూటన్ గురుత్వాకర్షణ సిద్ధాంతాన్ని ఆవిష్కరించాడు.

1666 : న్యూటన్ కాంతి విశ్లేషణాన్ని గుర్తించాడు. సూర్యకాంతి ఏడు రంగుల మయం అని పేర్కొన్నాడు.

1675 : ఓలస్‌రాయర్ కాంతికి పరిమితవేగం ఉందని ప్రకటించాడు. బృహస్పతి గ్రహపు ఉపగ్రహాలు గురించి అధ్యయనం చేశాడు.

1684 ; ఎడ్మండ్ హేలీ - న్యూటన్ ట్రినిటి కాలేజీలో సమావేశం అయారు.

1687 : న్యూటన్ గ్రంథం ప్రిన్సిపియా వెలువడింది.

1766 : హెన్రీ ఉదజని, కేవిండిష్ ఉనికిని గుర్తించాడు. ఇవి విశ్వంలో ఎక్కువ శాతంలో ఉందని ధ్రువీకరించాడు.

1781 : విలియమ్ హెర్షెల్ యేరేథస్ గ్రహాన్ని గుర్తించాడు.

1793 : విలియమ్ స్మిత్ అనే బ్రిటిష్ సర్వేయర్, ఇంజనీర్ భూమి పొరల నిర్మాణం గురించి పరిశీలనలు జరిపారు.

1800 : విలియం హెర్షల్ పరారుణ కాంతిని గుర్తించాడు.

1801 : జోహమ్ రిటెర్ అతినీల లోహిత కిరణాలని గుర్తించాడు.

1831 : చార్లెస్ డార్విన్ 'బీగిల్' అనే నౌకలో ఐదేళ్ళ ప్రపంచ యాత్రకి బయయిదేరాడు.

1837 : డార్విన్ పరిణామ సిద్ధాంతాన్ని ప్రకటించాడు.

1847 : హెర్మాన్ వాన్ హెల్మ్‌హల్ట్ శక్తి అవినాశన సిద్ధాంతాన్ని ప్రకటించాడు.

1850 : డబ్ల్యు. సి బాండ్. హార్వర్డ్ నుంచి మొట్టమొదటగా చంద్రుడి ఫొటో తీశాడు.

1859 : డార్విన్ వ్రాసిన 'ఆరిజన్ ఆఫ్ స్పిసీస్' గ్రంథం విలువడింది.

1862 : కాంతి వేగాన్ని ఫౌకాల్ట్ మరలా గుణించాడు.

1864 : విద్యుచ్ఛక్తి, అయస్కాంత శక్తి ఒకటే అనే ఏకశక్తి సిద్ధాంతాన్ని జేమ్స్ క్లార్క్-మేక్స్ వెల్ ప్రతిపాదించాడు.

1865 : గ్రెగార్ మెండల్ అనువంశిక లక్షణాల సంక్రమణ గురించి ప్రకటించాడు.

1879 : ఆల్బెర్ట్ మైకేల్‌సన్ కాంతి వేగాన్ని నిర్ణయించాడు.

1895 : ఇ. ఇ. బెర్నార్డ్ పాలపుంత నక్షత్ర మండలాన్ని ఫొటో తీశాడు.

1897 : జె. జె. థామ్సన్ 'ఎలక్ట్రాన్'ని గుర్తించాడు.

1898 : మేరీ - పేరీక్యూరీలు రేడియమ్, పొలోనియమ్ మూలకాల్ని కనుగొన్నారు.

1900 : మేక్స్‌ప్లాంక్ క్వాంటమ్ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

1905 : ఆల్బెర్ట్ ఐన్‌స్టైయిన్ ప్రత్యేక సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రకటించాడు.

1911 : అణువుల సూక్ష్మ ద్రవ్యరాశి అంతా న్యూక్లియైలో నిక్షిప్తం అయి ఉందని ఎర్నెస్ట్ రూథర్‌ఫర్డ్ ధ్రువీకరించాడు.

1913 : నీల్స్ భోర్ అణు నిర్మాణాన్ని ప్రకటించాడు. సూర్యుడి చుట్టూ గ్రహాలు తిరుగుతున్నట్లు ఎలక్ట్రానులు న్యూక్లియై చుట్టూ తిరుగుతున్నాయని భోర్ ధ్రువీకరించాడు.

1915 : ఆర్నాల్డ్ సోమర్‌ఫ్లెడ్, భోర్ చెప్పిన అణు నిర్మాణాన్ని పునః పరిశీలించాడు.

1916 : ఆల్బెర్ట్ ఐన్‌స్టైయిన్ సాపేక్ష సిద్ధాంత గ్రంథాన్ని ప్రచురించాడు.

1916-17 : నక్షత్రాలు వాయు పదార్థ నిర్మితాలని ఆర్థన్ స్టాన్లీ ఎండిగ్టన్ ప్రకటించాడు.

1918 : ప్రపంచపు అతి పెద్ద టెలిస్కోప్ (100 అంగుళాలు) మౌంట్ విల్సన్ వద్ద పని ప్రారంభించింది.

1919 : సూర్యగ్రహణ సమయంలో ఐన్‌స్టైయిన్ సాపేక్ష సిద్ధాంతానికి ఉపపత్తుల్ని సాధించాడు.

1924 : ద్రవ్యరాశి తరంగాలవలె ఉందని లూయీ డి బ్రొగ్లైల్ సిద్ధాంతీకరించాడు.

1925 : ఎడ్విన్ హబల్ 'యాండ్రోమిడా గెలాక్సీ' గురించి కొత్త సిద్ధాంతాన్ని ప్రకటించాడు.

1926 : పాలపుంత నక్షత్ర మండలం ఆత్మప్రదక్షిణం చేస్తున్నదని లిండ్‌బాల్డ్ చెప్పాడు.

1927 : జార్జెస్ లెమిట్రి 'విశ్వ విస్తరణ' సిద్ధాంతాన్ని ఆవిష్కరించాడు.

1928 : అణుకేంద్రికల సంయోగం వలన నక్షత్రాలలో శక్తి, కాంతి జన్మిస్తున్నాయని జార్జిగామోన్ ప్రకటించాడు. భూమిపై ఏ సూత్రాలు వర్తిస్తున్నాయో ఆ సూత్రాలకి లోబడే విశ్వాంతరాళంలో ఆయా మూలకాలున్నాయని ఇరాబొవెన్ సిద్ధాంతీకరించాడు.

1932 : జేమ్స్ ఛాడ్విక్ అణుగర్భంలో న్యూట్రాన్‌ని గుర్తించాడు. పాలపుంత నుంచి రేడియో తరంగాలు వస్తున్నాయని కారల్ జాన్‌స్కీ గుర్తించాడు.

1935 : అణువులో 'మెసాన్'లు ఉన్నాయని హిడికియుకావా వూహించాడు.

1939 : అణువిచ్ఛేదన సిద్ధాంతాన్ని నీల్స్‌బోర్, జాన్ ఆర్చిబాల్డ్ రూపొందించారు.

1940 : పాలపుంత గురించిన తొలి రేడియో పటాన్ని గ్రోటె రెబెర్ తయారు చేశాడు.

1948 : పాలోమార్ పర్వతంపై 200 అంగుళాలు టెలిస్కోప్ పని ప్రారంభం.

1948-50 : రేడియో కార్బన డేటింగ్ పద్ధతిని విల్లార్డ్‌ఫ్రాంక్ లిబి అభివృద్ధి పరిచాడు.

1958 : పాలపుంత నక్షత్ర మండలపు స్పైరల్.... నిర్మాణం గురించి వూర్ట్ బృందం పరిశీలనలు జరిపారు.

1960 : ఆకాశంలో క్వాసార్‌లను అలాన్ సాండాగ్ మరియు థామస్ మేథ్యూస్‌లు గుర్తించారు.

1961 : అణువులోని ఉపాణువులు గురించి 'ఎనిమిది మార్గాల సూత్రం' ఒకదానిని గెల్‌మన్ మరియు యురాల్ నెమన్ విడివిడిగా రూపొందించారు.

1964 : ప్రోటానులు, న్యూట్రానులు కూడా యింకా చిన్న చిన్నవైన 'క్వార్క్'లు అనే సూక్ష్మకణాలతో నిర్మితమైనవని గెల్‌మాన్ మరియు జార్జిజెవిగ్ ప్రకటించారు.

1967 ; చాలా సాంద్రత గల పల్సార్ నక్షత్రాలు గురించి జొసెలిన్‌బెల్, యంటోని హెనిష్ చెప్పారు.

1983 : యూనిఫికేషన్ థియరీ గురించి పరిశీలనలు ముమ్మరం అయాయి.

1987 : అమెరికా జపాన్‌లలోనేకాక మైసూరు కోలార్ బంగారు గనులలో ప్రోటాన్ శైథిల్య సిద్ధాంతం గురించిన పరిశీలనలు సత్ఫలితాలను యిచ్చాయి

1988 : మనం గుర్తించగలిగినంత దూరపు విశ్వాంతరాళం చివరన క్వాసార్‌లను గుర్తించారు. వాటి నుంచి కాంతి దాదాపు 17 బిలియన్ సంవత్సరాల నుంచి ప్రసరిస్తున్నదని లెక్కలు కట్టారు. ఈ సంవత్సరంలోనే సూపర్‌నోవాని గుర్తించారు.

# ఆబ్జెక్టివ్ టైప్

1. మాంసకృతులు ఎక్కువగా వున్న చిక్కుడు ఏది?
(సోయా చిక్కుడు - 43 శాతము)
2. చక్కెర అసలు లేని దుంప ఏది? (కేరెట్)
3. మనిషికి రోజుకు ఎన్ని పాలు కావాలి? (250 గ్రాములు)
4. 'కార్టిస్టోన్ రసాయనాన్ని తీసే దుంప ఏది? (పెండలం దుంప)
5. ఎక్స్-రే అనర్థాలను నివారించే మొక్క ఏది? (చిన్నకలబంద - అలోయ్)
6. స్వీట్ యాపిల్ అని దేనికి పేరు? (టమాటో)
7. సుగంధ ద్రవ్యాల రాణి అని దేన్ని పిలుస్తారు? (ఏలకులు)
8. కృత్రిమంగా పండించలేని కాయ ఏది? (సీతాఫలం)
9. ఫలరాజం అని దేనికి పేరు? (మామిడి)
10. సాలడై జేషన్ అంటే ఏమిటి? (పచ్చికూరలు తినడం)
11. పెద్దఉసిరి, జామ, బొప్పాయి, నిమ్మలలో లభ్యమయ్యే విటమిన్?
('సి' విటమిన్)
12. తోటకూర, పాలకూరలలో లభ్యమయ్యే విటమిన్ ఏది? ('ఎ' విటమిన్)
13. పిండి పదార్థాలు సమృద్ధిగా లభ్యమయ్యే ఆహారపదార్థాలు ఏవి?
(వరి, గోదుమ)
14. ఆహారంలోని శక్తిని కొలుచు ప్రమాణం ఏది? (కేలరీలు)
15. 'ఫ్లోరోసిస్' వ్యాధి నివారణకు ఏ పదార్థం ఉపయోగిస్తున్నారు
(చింతపండు)
16. గ్రుడ్డులోని తెల్లభాగంలో ఉండే పదార్థం ఏది? (కాల్షియం కార్బొనేట్)
17. ఆహార పదార్థాలు నిలువ ఉంచటానికి వాడేది? (సోడియం బెంజోయేట్)
18. ఆరోగ్యవంతమైన దంతాలకు అవసరమైనది? (కాల్షియం)
19. అధిక రక్తపోటు నివారణకు వాడే ఆయుర్వేద మందు ఏది? (సర్పగంధి)
20. ఫ్లోరోసిస్ వ్యాధి రావడానికి కారణం?
(త్రాగే నీటిలో ఫ్లోరిన్ అధికం కావడం)
21. ఫ్లోరోసిస్ వ్యాధి మన రాష్ట్రంలో ఏ జిల్లాల్లో ఎక్కువగా ఉంది?
(నల్గొండ, కర్నూలు)

22. బిళ్ళగన్నేరు ఆకులు నుంచి తీసే కేన్సర్ నిరోధక రసాయనాలేవి?
(విన్‌క్రిస్టన్, విన్‌బ్లాస్టిన్)
23. ఏ విటమిన్ లోపం వలన కిడ్నీలో రాళ్ళు ఏర్పడతాయి? ('ఎ' విటమిన్)
24. గాయిటర్ వ్యాధికి మూల కారణం ఏమిటి? (అయోడిన్ లోపం)
25. 'క్వాషియోర్కర్' వ్యాధి దేని కారణంగా సంభవిస్తుంది?
(ప్రోటీన్ల లోపం వల్ల)
26. "పోలియోమైలిటిస్" అనగా నేమి? (శిశు పక్షవాతం)
27. మలేరియా వ్యాధి కారణంగా శరీరంలో ఏ భాగం పెద్దదిగా అవుతుంది?
(స్ప్లీన్)
28. కామెర్లవ్యాధి శరీరంలో ఏ భాగానికి సంబంధించినది? (కాలేయము)
29. 'ఎగ్జిమా' అనే వ్యాధి శరీరంలో ఏ భాగానికి వస్తుంది? (చర్మము)
30. ఏ విటమిన్ లోపం వల్ల రక్తం త్వరితంగా గడ్డకట్టదు? ('కె' విటమిన్)
31. రక్తం గడ్డ కట్టుటకు తోడ్పడు అయాన్ ఏది? (కాల్షియం)
32. రక్తనాళాలలో రక్తం గడ్డ కట్టకుండా తోడ్పడు పదార్థం ఏది?
(హెపారిన్)
33. శస్త్ర చికిత్స చేసే ముందు రోగికి ఇచ్చే విటమిన్ ఏది? ('కె' విటమిన్)
34. ఏంటి జ్గెరాప్తాలిమిక్ విటమిన్ ఏది? ('ఎ' విటమిన్)
35. 'ఎ' విటమిన్ లోపం వల్ల కలిగే రోగం ఏది? (రేచీకటి)
36. ఐరన్ దాతువు లోపం వల్ల వచ్చే వ్యాధి ఏది? (రక్తహీనత)
37. రోజుకు ఎన్నిగ్రాములు నూనె పదార్థాలు శరీరానికి అవసరం?
(15 గ్రాములు)
38. అతి మూత్రవ్యాధి ఏ స్రావము లోపం వల్ల కలుగుతుంది? (ఇన్సులిన్)
39. పీయూషగ్రంధి స్రావం తక్కువైతే కలుగు వ్యాధి ఏది?
(మరుగుజ్జుతనము)
40. విటమిన్ 'ఇ' యొక్క ఉపయోగమేమిటి?
(హానికరమైన ఆక్సీకరణను తగ్గించుట)
41. పిల్లలలో ఎముకల పెరుగుదలకు అవసరమయ్యేవి ఏమిటి?
(కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ 'డి')
42. కుక్కకాటువల్ల వచ్చే వ్యాధి ఏది? (హైడ్రో ఫోబియా)
43. విటమిన్ 'సి'కి గల మరో పేరేమిటి? (ఆస్కార్బిక్ ఆమ్లం)
44. డయాలసిస్ అనే విధానాన్ని ఏ రోగికి ఉపయోగిస్తారు?
(మూత్రపిండాల రోగి)

45. సూర్యరశ్మి నుండి లభించే విటమిన్ ఏది? ('డి' విటమిన్)
46. విటమిన్ 'సి' లోపం వలన కలిగే వ్యాధి ఏది? (రికెట్స్)
47. వంధ్యత్వం కలగడానికి ఏ విటమిన్ లోపం కారణమవుతుంది? ('ఇ' విటమిన్)
48. ఏ విటమిన్ లోపం వలన చిగుళ్ళ నుండి రక్తం వస్తుంది? ('సి' విటమిన్)
49. "సిరోసిస్" (Cirrhosis) ఏ శరీర భాగానికి సంబంధించినది? (కాలేయం)
50. 'పయోరియా' అనే వ్యాధి ఏ శరీర భాగానికి సంబంధించిన వ్యాధి? (దంతాలు)
51. మలేరియాకు వాడే మందు పేరేమిటి? (క్వినైన్)
52. ఏ గ్రూప్ రక్తం యూనివర్స్ గ్రూప్? ('0' గ్రూప్)
53. శరీరంలో నీటి శాతాన్ని బ్యాలన్స్ చేసె అవయవం ఏది? (మూత్రపిండాలు)
54. 'ఐలెండ్స్ ఆఫ్ లాంగర్‌హీన్' ఎక్కడ ఉన్నాయి? (క్లోమగ్రంధి)
55. 'మిల్ ఫీవర్' జ్వరం ఎక్కువగా ఎవరికి వస్తుంది? (ప్రత్తిమిల్లు కార్మికులకు)
56. గిరిజనులకు ఎక్కువగా వచ్చే వ్యాధి ఏది? (గొంతువాపు వ్యాధి)
57. పందుల ద్వారా వ్యాపించే వ్యాధి ఏది? (ఎన్‌సెఫాలిటీస్-మెదడువాపువ్యాధి)
58. ఆరోగ్యవంతుడైన మనిషి రక్తపోటు ఎంత ఉండాలి? (80 - 120)
59. మానవ శరీరంలో ఏ గ్రంధిని మాస్టర్ ఆఫ్ గ్లాండ్‌గా పిలుస్తారు? (పిట్యూటరీ)
60. శరీర ఉష్ణోగ్రతను క్రమపరిచే భాగం ఏది? (ద్వార గోర్థము)
61. పాల ఉత్పత్తికి తోడ్పడు హార్మోన్ ఏది? (లాక్టోజెనిక్)
62. యాంటి స్టెరిలిటి విటమిన్ ఏది? ('ఇ' విటమిన్)
63. కణ విభజనకు ఉపయోగపడే హార్మోన్ ఏది? (సైటోకైనిన్లు)
64. ధాన్యపు పై పొరలలో వుండే విటమిన్ ఏది? ($B_1$ విటమిన్)
65. మానవ శరీరంలో అతి విస్తారంగా వుండే మూలకం ఏది? (ఆక్సిజన్)
66. బి.సి.జి. టీకాలను ఏ వ్యాధి రాకుండా ఉపయోగిస్తారు. (క్షయ)
67. త్రాచుపాముకాటుకు ఏ గ్రూపు రక్తం గల మనిషి ఎక్కువ సమయం జీవించగలుగుతాడు? (O, గ్రూపు)
68. కాడ్‌లివర్ ఆయిల్‌లో అధికంగా వున్న విటమిన్ ఏది? ('ఎ' విటమిన్)

69. నోటిలో ఉండే గ్రంథుల పేరేమిటి? (లాలాజల గ్రంథులు)
70. కణంలోని శక్తికేంద్రాలు ఏవి? (మైటోఖాండ్రియా)
71. మానవుని మూత్రం ద్వారా విడుదలయ్యే విటమిన్ ఏది? ('సి' విటమిన్)
72. 'పెరిడాక్సిన్' ఏ విటమిన్ యొక్క రసాయనిక నామము? ($B_6$ విటమిన్)
73. నీటిలో కరిగే విటమిన్లు ఏవి? (బి కాంప్లెక్స్, సి విటమిన్లు)
74. కొవ్వులలో కరిగే విటమిన్లు ఏవి? (ఎ,డి,ఇ,కె. విటమిన్లు)
75. ట్రకోమా అనే వ్యాధి ఏ శరీరావయానికి సంబంధించినది? (కళ్ళు)
76. పోలియో వ్యాధి ఏ పరాన్నజీవి వల్ల సంభవిస్తుంది? (పోలియో మైలిటిస్)
77. లీష్మనియా (Sand fly) పరాన్న జీవివల్ల వచ్చే వ్యాధి ఏది? (కాలా అజార్)
78. ఆరోగ్యవంతమైన మానవుని కన్ను ఎంత కనిష్ట దూరంలో వున్న వస్తువును స్పష్టంగా చూడగలుగుతుంది? (25 సెం.మీ)
79. పీల్చే గాలిలో కార్బన్ మోనాక్సైడ్ శాతం ఎక్కువైనప్పుడు శరీరంలోని ఏ భాగానికి హాని కలుగుతుంది? (హెమోగ్లోబిన్)
80. కుంభాకార కటకాన్ని ఏ రకపు కంటిలోపాన్ని సరిచేయుటకు వాడతారు? (దీర్ఘదృష్టి)
81. కంటిని దానం చేసిన వ్యక్తి నుండి ఏభాగాన్ని తొలగిస్తారు? (శుక్లం)
82. డెంగ్ (Dengue) జ్వరము వేనివలన వస్తుంది? (దోమలు)
83. 'సెలినాలజీ' దేన్ని గురించి అధ్యయనం చేసే శాస్త్రం? (చంద్రుని గురించి)
84. భూమికి అతిసమీపంలో వున్న నక్షత్రం ఏది? (ఆల్ఫా సెంటారి)
85. గాలిలో నత్రజని శాతం ఎంత? (78 శాతం)
86. ఎలక్ట్రికల్ వైబ్రేషన్స్‌ను రికార్డు చేయు సాధనం ఏద? (ఆసిలోగ్రాఫ్)
87. అతి చిన్న పక్షి ఏది? (హమ్మింగ్ బర్డ్)
88. అత్యంత ఎక్కువ లవణ స్వభావం కలిగిన సముద్రం ఏది? (ఇజ్రాయిల్, జోర్డాన్‌ల సరిహద్దులోగల మృతసముద్రం)
89. వేడినీటి జలను ఏమంటారు? (గీజర్)
90. బి.హెచ్.సి. అనే క్రిమిసంహారక మందు పూర్తినామం ఏమిటి? (Benzene Hexa Chloride)
91. దక్షిణాదిన నెలకొల్పిన మొట్టమొదటి గ్యాస్ ఆధారిత ఎరువుల కర్మాగారం ఎక్కడ ఉంది? (కాకినాడ - నాగార్జున ఫెర్టిలైజర్ ఫాక్టరీ)
92. మన రాష్ట్రంలో శ్రేష్టమైన బెరైటీస్ గనులు ఎచ్చట వున్నాయి? (మంగంపేట - కడపజిల్లా)

93. ASLV అనగా – (అగ్‌మెంటెడ్ శాటిలైట్ లాంచింగ్ వెహికిల్)

94. మొట్టమొదటిసారి అంతరిక్షంలో ప్రయాణించిన యూరీగగారిన్ ఉపయోగించిన నౌక పేరేమిటి? (వోస్టాక్)

95. వైద్యశాస్త్రాన్ని అభ్యసించిన మొట్టమొదటి భారతీయ మహిళ ఎవరు? (కాదంబినీ గంగూలి)

96. సముద్రపు లోతును కనుగొనటానికి ఉపయోగించే పరికరం ఏది? (పాథోమీటరు)

97. వంశపారంపర్యంగా వచ్చు లక్షణాలను కలుగజేయు కణాంగాలు ఏవి? (క్రోమోజోములు)

98. హోమియో వైద్యశాస్త్ర సృష్టికర్త ఎవరు? (డా॥ హానిమన్)

99. భూమి అంతర్గత వేడివలన ఏమి ఏర్పడతాయి? (అగ్నిపర్వతాలు)

100. సూర్యునిలో హీలియం, హైడ్రోజన్ ఏ నిష్పత్తిలో వుంటాయి? (3:1)

101. టార్చ్‌లైటుకు ఉపయోగించు అద్దం ఏది? (కుంభాకార కటకం)

102. అమెరికన్ స్పేస్‌షిప్, వాయేజర్-1 పరిశోధించిన గ్రహం ఏది? (జూపిటర్ - 1977)

103. విక్రమ్ సారాభాయ్ స్పేస్ సెంటర్ ఎక్కడ ఉంది? (త్రివేంద్రం)

104. అల్యూమినియం దేనినుండి తీస్తారు? (బాక్సైట్

105. ద్రవ పదార్థాల బాయిలింగ్ పాయింట్ దేనిపై ఆధారపడి వుంటుంది? (పీడనం)

106. జెట్ ఇంజన్ పనిచేసే సూత్రం ఏది? (న్యూటన్స్ మూడవ గమన సూత్రం)

107. APPLE అనగా – (ఏరియన్ పాసింజర్ పేలోడ్ ఎక్స్‌పెరిమెంట్)

108. తుంబాలోని రాకెట్ కేంద్రం పేరేమిటి? (TERLS - తుంబ ఈక్వెటోరియల్ రాకెట్ లాంచింగ్ స్టేషన్)

109. ఇండియన్ స్పేస్ రీసెర్చ్ ఆర్గనైజేషన్ (ISRO) ప్రధాన కార్యాలయం ఎక్కడ ఉంది? (బెంగుళూరు)

110. సూర్యుని ఉపరితల ఉష్ణోగ్రత ఎంత? (6000 డిగ్రీల సెంటిగ్రేడ్)

111. ఇన్నర్ ప్లానెట్స్ అనగా (మెర్క్యూరి, వీనస్, ఎర్త్, మార్స్)

112. భారతదేశంలో టెలివిజన్ ప్రసారాలను ప్రయోగాత్మకంగా ఏ సంవత్సరంలో ప్రారంభించారు? (1959 లో ప్రారంభించారు)

113. 'క్రెస్కోగ్రాఫ్'ను దేనికి ఉపయోగిస్తారు? (మొక్కల పెరుగుదలను కొలుచుటకు)

114. ప్రసిద్ధిచెందిన తొల సంచార ఆస్పత్రి రైలు పేరేమిటి?
(లైఫ్‌లైన్ ఎక్స్‌ప్రెస్)

115. ప్రపంచంలో అతిపెద్ద టెలిస్కోపును ఎక్కడ నెలకొల్పుతున్నారు?
(అటకామా ఎడారి - చిలీ)

116. కాలిక్యులేటర్‌ను కనిపెట్టినదెవరు? (బ్రిటన్‌కు చెందిన బాబేజ్)

117. ప్రపంచ నౌకా యాత్ర చేసిన మొదటి వ్యక్తి? (మాజిలాన్)

118. చైనా తన తొలి ఉపగ్రహాన్ని ఎప్పుడు ప్రయోగించినది? (1970లో)

119. ఇన్‌శాట్ – 1బి ని ప్రయోగించిన సంవత్సరం ఏది? (1983)

120. SLCM అంటే - (సీ లాంచ్‌డ్ క్రూయిజ్ మిస్సైల్స్)

121. ద్రవ రూపంలో వున్న లోహం ఏది? (పాదరసం)

122. జియోమోర్ఫాలజి అనగా – (భూమిని గురించిన శాస్త్రం)

123. 'కలర్ ఫొటోగ్రఫీ'ని కనుగొన్నదెవరు? (గాబ్రియల్ లిప్‌మన్)

124. జాతీయ కేన్సర్ పరిశోధనాలయం ఎచట ఉంది? (మద్రాసు)

125. క్లినో మీటరును దేనికి ఉపయోగిస్తారు?
(కొండలు, గుట్టలు ఎంత వాలుగా వున్నాయో తెలుసుకోవడానికి)

126. థియోడలైట్ దేనికి ఉపయోగిస్తారు?
(భూతలంపై ఏయే వస్తువులు పరస్పరం ఎంత దూరంలో ఏయే దిక్కులలో వున్నాయో తెలుసుకోవడానికి సర్వేయర్లు ఉపయోగిస్తారు)

127. ELISA టెక్నిక్‌ను దేనికి ఉపయోగిస్తారు?
(శరీర ద్రవాలలో AIDS వైరస్‌ను గుర్తించటానికి ELISA టెక్నిక్ ఉపయోగిస్తారు)

128. ప్రపంచంలో అతి శక్తివంతమైన మైక్రోస్కోపు ఏది?
(స్కానింగ్ టన్నెలింగ్ మైక్రోస్కోపు - దీన్ని 1981లో జూరిజ్ రీసెర్చ్ లేబరేటరీ వారు తయారు చేశారు)

129 లెడ్ పెరాక్సైడ్‌ను వాడుక భాషలో ఏమంటారు? (ఎర్రసిందూరం)

130. అత్యధిక కళ్ళుగల జీవి ఏది? (ఇలాకీ పెనిప్లస్)

131. శబ్ద తీవ్రతని కొలిచే ప్రమాణం ఏది? (డెసిబుల్)

132. పైకనో మీటరును దేనికి ఉపయోగిస్తారు?
(సాంద్రత, ద్రవ వ్యాకోచ గుణం గుర్తించుటకు)

133. ఉరుముల కంటే మెరుపు ముందుగా కనిపించుటకు గల కారణం?
(ధ్వని కన్నా కాంతి వేగంగా ప్రయాణించును)

134. ఆస్టరాయిడ్స్ అనగా - (జూపిటర్, మార్స్ మధ్య తిరుగుతూ ఉండే గ్రహ శకలాలు)
135. లెక్సికోగ్రఫీ అనగా— — (నిఘంటువుల తయారీ)
136. టి. ఎన్. టి. అనగా (Tri-Nitro-Tolune- వేగంగా మండు పదార్థం)
137. ఎలక్ట్రోసెఫలోగ్రాఫ్ అనగా (మెదడులోని విద్యుత్ తరంగాలను కొలుచు యంత్రం)
138. సినిమా స్కోప్‌ను కనిపెట్టినదెవరు? (హెన్రీక్రెటీన్ ఫ్రాన్స్ - 1931)
139. ఓడోమీటరు అనగా (వాహనాలు నడిచిన దూరమును కొలుచు సాధనం)
140. స్వదేశీ పరిజ్ఞానంతో నిర్మించిన మొదటి క్షిపణి (INS విభూతి)
141. 'ఆర్యభట్ట' ప్రయోగించిన తేదీ (1975, ఏప్రిల్ 19)
142. SROSS - 2 ఉపగ్రహం ప్రయోగించబడినది? (జులై 13, 1988)
143. డయాబెటిస్‌కి గల కారణం ఏమిటి? (సాంక్రియాస్ పనిచేయకపోవటం)
144. యురేనియం ఫ్యూషన్ కనిపెట్టినది? (ఆటోహన్)
145. సూర్యునికి అతి సమీపంలో వున్న గ్రహం? (మెర్క్యూరి)
146. సూర్యునికి అతి దూరంలో వున్న గ్రహం? (ప్లూటో)
147. మారినర్ - 9 అనే ఉపగ్రహాన్ని ప్రయోగించిన దేశం? (అమెరికా 1971 మార్చి)
148. చంద్రుని మీద దిగిన తొలి రష్యా ఉపగ్రహం ఏది? (లూనా—24, 1974)
149. కాంతి ఎలక్ట్రోమాగ్నెటిక్ సిద్ధాంతాన్ని కనిపెట్టినదెవరు? (మాక్స్‌వెల్)
150. ఎక్స్‌పెరిమెంటల్ శాటిలైట్ కమ్యూనికేషన్ ఎర్త్‌స్టేషన్ ఎచ్చట ఉంది? (ఆర్వి, పూనా వద్ద)
151. జీర్ణమండలం ఏ భాగంలో ప్రోటీనులు పెప్టోనులుగా మార్చబడును?
152. కప్ప చర్మమును తేమగా ఉంచునది (శ్లేష్మగ్రంథులు)
153. కంటిలో ప్రతిబింబం ఏర్పడు భాగం (నేత్రపటలం (రెటీనా)
154. నేత్రపటలములోని కణాలు (రాడ్స్ మరియు కోన్స్)
155. మూత్రపిండాలు విసర్జనకాక చేయు వేరొకపనిఏది? (ద్రవాభిసరణ క్రమత)
156. పక్షిముక్కు ఏ పదార్థంతో నిర్మితమవుతుంది? (కొమ్ము)
157. కండరమును ఎముకతో కలుపు సంధాయం? (టెండాన్స్)
158. ఆల్కహాల్‌ను అధికంగా సేవించుట వలన నిర్మూలమయ్యే కణాలు (నాడీకణాలు)

159. టైఫాయిడ్ జ్వరనిర్ధారణకు జరిగే పరీక్ష పేరుఏమిటి?
(వైడల్ టెస్ట్ (Widal Test)

160. డ్రై ఐస్ అనగా (ఘనీభవించిన కార్బన్‌డై ఆక్సైడ్)

161. ఏ ఉష్ణోగ్రత వద్ద సెంటిగ్రేడ్ స్కేలు, ఫారన్‌హీట్ స్కేళ్ళలోని రీడింగ్‌లు సమానమవుతాయి? ($-40^0$C వద్ద)

162. సోనార్ అనగా? (సౌండ్ నేవిగేషన్ అండ్ రేంజింగ్. నీటిలో దాగివుండే వస్తువులను గుర్తించడానికి వాడతారు)

163. సీస్మోగ్రాఫ్‌లు ఎందుకు ఉపయోగిస్తారు?
(భూకంపాలను గుర్తించడానికి, వాటి తీవ్రతను కొలవటానికి)

164. భూమిపై ఇంతవరకు అతితక్కువ ఉష్ణోగ్రత నమోదైన ప్రదేశం ఏది?
(ఓస్టాక్-పూర్వపు యు.ఎస్.ఎస్.ఆర్)

165. అమెరికా స్పేస్‌షటిల్ కొలంబియా మొట్టమొదటిసారి ఎపుడు ప్రయోగించబడినది? (1981, ఏప్రిల్)

166. మనుషులను చూస్తే అనవసరంగా భయపడుట, ఏవగించుకోవడం అనే లక్షణాలు వుండే వ్యాధి ఏది? (యాంత్రోఫోబియా)

167. మొక్కల చిగుళ్ళలో వుండే విటమిన్ ఏది? ($B_2$ రైబోఫ్లావిన్)

168. మానవుని కపాల నాడుల సంఖ్య? (12 జతలు)

169. కప్ప రూప విక్రియలో తోడ్పడు హార్మోను ఏది? (థైరాక్సిన్)

170. మానవునిలో అతి పెద్ద ఎముక ఏది? (తొడ ఎముక)

171. బ్లూ రివల్యూషన్ అనగా ఏమిటి?
(శాస్త్రీయపరంగా సముద్రాలనుండి అధిక ఫలసాయాన్ని పొందుట)

172. 'క్విన్‌కంక్స్' అంటే ఏమిటి? (క్రమపద్ధతిలో వనాల పెంపకం)

173. శ్వేత విప్లవం అంటే ఏమిటి? (అధిక పాల ఉత్పత్తి)

174. నీలి విప్లవం అంటే ఏమిటి? (చేపల పెంపకం అభివృద్ధి)

175. పక్షులకు, సరీసృపాలకు మధ్య సమన్వయ జీవి ఏది? (ఆర్కియోప్టెరిక్స్)

176 ఎక్కువ గర్భావధి కాలం గల జీవి ఏది? (ఏనుగు - 600 రోజులు)

177. మానవుని చెవిలో శబ్దాన్ని గ్రహించు ముఖ్యభాగం ఏది?
(ఆర్గాన్ ఆఫ్ కార్టి)

178. మానవునిలోని వెన్నుపూసల సంఖ్య ఎంత? (33)

179. అతి ఎక్కువ కాలం జీవించు జీవి ఏది? (తాబేలు, 350 సం॥)

180 మానవుని ఎర్రరక్తకణాల జీవిత కాలం ఎంత? (120 రోజులు)

181. ఇండియన్ అగ్రికల్చరల్ రీసెర్చి ఇన్స్టిట్యూట్ ఎచ్చట ఉంది? (న్యూఢిల్లీ)

182. ఇస్త్రీపెట్టె యందలి తీగచుట్ట తయారుచేయుటకు వాడు పదార్థం ఏది? (నిక్రోమ్)

183. టెలిఫోన్‌లో ధ్వని తరంగాలను, విద్యుత్ తరంగాలుగా మార్చు భాగం ఏది? (మైక్రోఫోన్)

184. స్థావర ఉపగ్రహం అనగా?
(భూమి కోణీయ వేగంతో సమానమైన కోణీయ వేగం కలిగి వున్న ఉపగ్రహం)

185. నూనెలు మరియు క్రొవ్వుల రసాయన నామం?
(గ్లిసరాల్ యొక్క ట్రై ఎస్టర్‌లు)

186. న్యూక్లియర్ రియాక్టర్‌లలో వేగంగా కదిలే న్యూట్రానుల వేగాన్ని తగ్గించుటకు ఉపయోగించు మోడరేటరు? (భారజలం)

187. ఎలక్ట్రాన్‌ను కనుగొన్నది? (థామ్సన్)

188. ఎలక్ట్రాన్ ద్రవ్యరాశి మరియు ఆవేశం?
($9.107 \times 10^{-28}$ గ్రా; $4.802 \times 10^{-10}$ e.s.u)

189. ప్రోటాన్‌ను కనుగొన్నది? (గోల్డ్ స్టైన్)

190. ప్రోటాన్ ద్రవ్యరాశి మరియు ఆవేశం?
($1.672 \times 10^{-24}$ గ్రా; $4.802 \times 10^{-10}$ e.s.u)

191. న్యూట్రాన్‌ను కనుగొన్నది? (చాడ్విక్)

192. ప్రోటాన్ ద్రవ్యరాశి ఎంత? ($1.625 \times 10^{-24}$ గ్రా)

193. పాదరసం అధికంగా లభించు దేశం ఏది? (ఇటలీ)

194. అతి ఎత్తైన ప్రాంతంలో వున్న సరస్సు ఏది? (టిటికన్, బొలీవియా)

195. ఐస్‌కు, మంచుకు గల తేడా ఏమిటి?
(నీటిని చల్లార్చినప్పుడు ఏర్పడే ఘనపదార్థం ఐస్. నీటిఆవిరి ఒక్కసారిగా చల్లని ప్రదేశానికి వచ్చినప్పుడు జనించే ఘనపదార్థం మంచు)

196. 'అగ్ని' క్షిపణిని ఎప్పుడు ప్రయోగించారు? (1989, మే 28)

197. సీటి యొక్క శాశ్వత కాఠిన్యాన్ని దేన్ని కలుపుట ద్వారా నిర్మూలించవచ్చును? (సోడియం కార్బొనేట్)

198. 'కేరట్'లో లభ్యమయ్యే విటమిన్ ఏది? ('ఎ' విటమిన్)

199. కల్పకంలోని ఫాస్ట్‌బ్రీడర్ రియాక్టర్‌లో ఉపయోగించు ఇంధనం ఏది?

200. మానవుని శరీరంలోని ఉష్ణోగ్రతను అదుపులో వుంచే గ్రంథి ఏది?
(పిట్యూటరీ గ్రంథి)

201. అతినీల లోహిత కిరణాల నుంచి జీవకోటికి రక్షణ కల్పించునది?
(ఓజోన్ పొర)

202. భూమికి, బృహస్పతికి మధ్యలో వున్న గ్రహం ఏది? (అంగారకుడు)

203. భారతదేశపు తొలి అంతరిక్ష యాత్రికుడు? (రాకేష్ శర్మ)

204 అతి వేగవంతమైన గ్రహం ఏది? (బుధుడు)

205. సహజంగా అణు రియాక్టర్లలో వాడే ఇంధనం ఏది? (యురేనియం)

206. విశ్వావిర్భావాన్ని సూచించే సిద్ధాంతం ఏది? (బిగ్ బ్యాంగ్)

207. స్టెయిన్‌లెస్ స్టీల్ తయారీలో వాడే లోహం ఏది? (క్రోమియం)

208. థర్మల్ కేంద్రాల నుంచి వెలువడే పొగలో ఏ రసాయనాలు ఎక్కువగా వున్నాయి? (సల్ఫర్‌డై ఆక్సైడ్)

209. కృత్రిమ వర్షం కురిపించడానికి వాడే రసాయనం ఏది?
(సిల్వర్ అయొడైడ్)

210. ప్రయోగశాలలో మొట్టమొదటగా తయారుచేయబడిన సేంద్రియపదార్థం ఏది? (యూరియా)

211. జపాన్‌లో మినిమాటా వ్యాధి ఏ కాలుష్యం వల్ల కలుగుతున్నది?
(కార్బన్ మోనాక్సైడ్)

212. 'సింద్రెల్లా ఆఫ్ జెనెటిక్స్' అని దేనిని అంటారు? (తీపి బఠాణి)

213. భారత్ మధ్యతరహా క్షిపణి 'ఆకాశ్'ను ఎప్పుడు ప్రయోగించారు?
(1990, ఆగస్టు 14)

214. జాతీయ పోషక ఆహార సంస్థ ఎచ్చట కలదు? (హైదరాబాద్)

215. విద్యుదావేశాలను నిలువ వుంచు పరికరం ఏది? (కెపాసిటర్)

216. విత్తనాలు లేని ఫలాలను తయారుచేయుటకు ఉపయోగించిన హార్మోను ఏది? (జిబ్బరిలిన్)

217. జీర్ణాశయంలో ఆమ్లం ఎక్కువైనప్పుడు ఉపయోగించే అంటాసిడ బిళ్ళల్లో సాధారణంగా వుండే క్షారం ఏది?
(మెగ్నీషియం హైడ్రాక్సైడ్)

218. కెంపులలో ఉండే ముఖ్యమైన రసాయన పదార్థం ఏది?
(అల్యూమినియం ఆక్సైడ్)

219. రేడియో ధార్మిక కిరణాలలో ఎక్కువ హాని కలిగించేవి?
(గామాకిరణాలు)

220. ఆడియో టేపులు తయారుచేయడానికి ఉపయోగించే పదార్థం ఏది? (ఫెర్రిక్ ఆక్సైడ్)

221. స్వదేశీ పరిజ్ఞానంతో తయారుచేయబడిన మొట్టమొదటి ఆయిల్ టాంకర్? (మోతీలాల్ నెహ్రూ)

222. దక్షిణ భారతదేశంలో మొట్టమొదటి గ్యాస్ ఆధారిత విద్యుత్ కేంద్రం ఎక్కడ ఉంది? (విజ్జేశ్వరం – ఆంధ్రప్రదేశ్)

223. మైక్రోబయాలజీ పితామహుడు ఎవరు? (లీవెన్ హాక్)

224. నేలపై వేగంగా పరుగెత్తు పక్షి ఏది? (ఉష్ట్ర పక్షి)

225. పాలను పెరుగుగా మార్చు బాక్టీరియా ఏది? (లాక్టోబాసిల్లస్)

226. ఉప్పు నీటిలో పెరిగే మొక్కలను ఏమంటారు? (హాలోఫైట్స్)

227. వినాళ గ్రంథులు స్రవించు స్రావాలను ఏమంటారు? (హార్మోన్‌లు)

228. అతి నిద్రావ్యాధిని కలిగించు పరాన్నజీవి? (ట్రిపనోజోవా, ప్రోటోజోవా)

229. త్రాచుపాము విషం ఏ వ్యవస్థపై పనిచేస్తుంది? (నాడీ, శ్వాస వ్యవస్థలు)

230. పాలలోని చక్కెరను ఏమంటారు? (లాక్టోస్)

231. మొలాసిస్‌ను ఫెర్మెంటేషన్ చేసినప్పుడు ఏర్పడునది? (ఇథైల్ ఆల్కహాలు)

232. గుండె చుట్టూ వుండే పొరను ఏమని పిలుస్తారు? (పెరికార్డియం)

233. మొట్టమొదటిగా ఏ సూక్ష్మజీవనాశని మందు కనుగొన్నారు? (పెన్సిలిన్)

234. జలుబుకి వాడే వాక్సిన్ పేరు (ఇంట్రా-నేషనల్ ఇంటర్ ఫిరాన్)

235. గర్భస్థ శిశువుకు చేసే పరీక్ష పేరు (యామ్నియా సెంటసిస్)

236. భారతదేశపు 'బేబిమేకర్' అని ఎవరిని పిలుస్తారు? (డాక్టరు ఇందిరా అహూజా)

237. 'థ్రోన్ ఆఫ్ ఇమ్యునిటీ' అని దేనికి పేరు? (థైమస్ గ్రంథి)

238. Bone-Marrow మార్పిడి చేసిన తొలి శాస్త్రవేత్త ఎవరు? (థామస్)

239. 'పెలికాన్ పేరడైజ్' అని ఏ సరస్సు పేరు? (పులికాట్ సరస్సు)

240. అంటార్కిటికాలో భారతదేశపు రెండవ శాశ్వత పరిశోధనా కేంద్రం పేరు? (మైత్రి)

241. దక్షిణధ్రువంపై కాలుమోపిన ప్రథమ భారతీయుడు? (కల్నల్ జె. కె. బజాజ్ 1989, జనవరి 17)

242. భారతదేశపు తొలి వేవ్ ఎనర్జీ ప్రాజెక్టు ఎచ్చట నెలకొల్పుతున్నారు? (త్రివేంద్రం సమీపంలోని విఝింజం వద్ద)

243. బాష్పోత్సేకం అంటే ఏమిటి?
(నీరు ఆవిరి రూపంలో ఆకుల నుంచి బయటకు పోయే ప్రక్రియ)

244. ధ్వని వేగం ఎక్కువగా గల పదార్థం ఏది? (ఘనపదార్థం)

245. మూలకాలలో తేలికైనది? (హైడ్రోజన్)

246. లోహాలలో తేలికైనది? (లీథియం)

247. RADAR అనగా— (రేడియో డిటెక్షన్ అండ్ రేంజింగ్)

248. జన్యువులను కృత్రిమంగా తయారుచేసినది? (హరగోవింద ఖొరానా)

249. మొట్టమొదటి గుండె మార్పిడి శస్త్ర చికిత్స చేసినది? (డాక్టర్ బెర్నార్డ్)

250. తెల్ల రక్తకణాలు అధికమైనచో కలిగే వ్యాధి ఏది?
(లుకేమియా-బ్లడ్ కాన్సర్)

251. మొక్కలను నీటిలో పెంచే విధానాన్ని ఏమంటారు? (హైడ్రో ఫోనిక్స్)

252. మానవ శరీరంలో ఆక్సిజన్ తరువాత అతి విస్తారంగా వున్న మూలకం ఏది? (కార్బన్)

253. ఆటోమొబైల్ వాహనాల నుండి వెలువడే వాయువులలో ఉండేది?
(కార్బన్ మోనాక్సైడ్)

254. మలేరియా పరాన్నజీవిని కనుగొన్న శాస్త్రవేత్త ఎవరు?
(సర్ రోనాల్డ్ రాస్)

255. ఆక్సిజన్, కార్బన్ - డై - ఆక్సైడుల రవాణాకు తోడ్పడు మూలకం?
(హెమోగ్లోబిన్)

256. ప్లాస్టర్ ఆఫ్ పారిస్ అనగా— (కాల్షియం సల్ఫేట్)

257. ఎండమావులకు కారణం ఏమిటి? (సంపూర్ణాంతర పరావర్తనం)

258. 'కింగ్ ఆఫ్ కెమికల్స్' అని దేన్ని అంటారు? (సల్ఫ్యూరిక్ ఆమ్లము)

259. పంచదార రసాయన నామం ఏమిటి? (సుక్రోజు)

260. ఆటంబాంబులో జరిగే కేంద్రక చర్య? (కేంద్రక విచ్ఛిత్తి)

261. సముద్ర నక్షత్రం లార్వా ఏది? (బైపిన్నేరియా)

262. నౌకాయానంలో దూరాన్ని కొలిచే ప్రమాణం ఏది? (నాటికల్ మైల్)

263. భారతదేశపు తొలి మాన్సూన్ ఎక్స్పెరిమెంటల్ శాటిలైట్ ఏది?
(రోహిణి)

264. విద్యుత్ ప్రవాహ దిశను మార్చుటకు ఉపయోగించే సాధనం ఏది?
(కమ్యుటేటర్)

265. మొక్కలపై విశిష్ఠ పరిశోధనలు చేసిన భారతీయ శాస్త్రవేత్త?
(జగదీశ్ చంద్రబోసు)

266. కర్పూరతైలం ఏ చెట్ల నుండి తీస్తారు? (పైన్)
267. జార్విక్-7 అనగా ఏమిటి? (కృత్రిమ గుండె)
268. 'జైపూర్ ఫుట్' (కృత్రిమకాలు) రూపొందించినదెవరు?
(డా॥ పి. ఎన్. సేథి)
269. ఉత్తర ధృవాన్ని కనుగొన్న మొదటి వ్యక్తి ఎవరు? (రాబర్ట్ పియరి)
270. సెంట్రల్ డ్రగ్ పరిశోధనాలయం ఎచ్చట ఉంది? (లక్నో)
271. మన దేశంలో తొలి అణువిద్యుత్ కేంద్రం? (తారాపూర్, 1969)
272. అతి పెద్ద పుష్పం ఏది? (రఫ్లేషియా)
273. నిరూపక రేఖా గణితానికి ఆద్యుడు? (రినీ డెకార్టె 1496-1650)
274. హిమాలయన్ జూలాజికల్ పార్క్ ఎచ్చట కలదు?
(డార్జిలింగ్-వెస్ట్‌బెంగాల్)
275. ప్రపంచంలో అతి పెద్దదైన సెగ్మెంటల్ ఆప్టికల్ టెలిస్కోప్ ఎచ్చట స్థాపించనున్నారు? (ఉజ్బెకిస్తాన్‌లోని సమర్‌ఖండ్ ప్రాంతంలో వున్న మెయ్‌డానాక్ పర్వత శిఖరం వద్ద)
276. ఆసియాలో అతి పెద్ద టెలిస్కోప్ ఎచ్చట ఉంది?
(తమిళనాడులోని కొవలూర్‌లో)
277. అతి వేగంగా పరిభ్రమించు గ్రహం ఏది? (జూపిటర్-9 గం॥ 50 ని॥)
278. కాస్టిక్ సోడా అనగా- (సోడియం హైడ్రాక్సైడు)
279. అతినీలలోహిత కిరణముల వలన చర్మంలో తయారయ్యే విటమిన్ ఏది? ('డి' విటమిన్)
280. క్యాండీద్రవం అని దేన్ని అంటారు? (పొటాషియం పర్మాంగనేట్)
281. జడవాయువులను కనుగొన్న శాస్త్రవేత్త ఎవరు? (రామ్సే)
282. భూమిలో అతి విస్తారంగా వున్న లోహం ఏది? (అల్యూమినియం)
283. ద్రవ రూపంలో ఉన్న అలోహం ఏది? (బ్రోమిన్)
284. లోహధర్మం వున్న అలోహం ఏది? (గ్రాఫైట్)
285. ప్రపంచంలో అతి పెద్ద టెలిస్కోప్ ఎక్కడ ఉంది?
(మౌంట్‌పలోమార్, అమెరికా)
286. భూమి సూర్యుని చుట్టూ తిరుగుచున్నదని మొదట కనుగొన్నది?
(కోపర్నికస్)
287. ఆంక్యుపంక్చర్ అనగా- (చైనావారి సూది వైద్యం)
288. చంద్రునిపై మొదట కాలు పెట్టినదెవరు? (నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్)

289. చంద్రుడు భూమి చుట్టూ తిరగడానికి పట్టే కాలం? (27⅓ రోజులు)
290. చంద్రుని యొక్క వ్యాసం ఎంత? (3476 కి.మీ)
291. భారత్‌లో అణుశాస్త్రాన్ని ఆరంభించినది? (హెచ్.జె.బాబా)
292. మనదేశంలోని అంతరిక్ష పరిశోధనా కేంద్రాలలో పెద్దది?
(విక్రమ సారాభాయి స్పేస్ సెంటర్, త్రివేంద్రమ్)
293. ఆర్యభట్ట వ్రాసిన ఖగోళ శాస్త్ర గ్రంథం? (సూర్య సిద్ధాంతం)
294. డి. ఎస్. సి. పొందిన తొలి ఆంధ్రుడెవరు? (డా॥ ఎ. ఎల్. నారాయణ)
295. మనిషి జీవకణంలో క్రోమోజోముల సంఖ్య? (46 లేక 23 జతలు)
296. 'బందరుబిడ్డ' అని ఏ వాయువును అంటారు? (హీలియం)
297. 'గోబర్ గ్యాస్' లో వుండే వాయువు ఏది? (మీథేన్)
298. మన రాష్ట్రంలో భారజల కర్మాగారం ఎక్కడ ఉంది? (మణుగూరు)
299. మొక్కలలో నత్రజని స్థాపనచేసే సూక్ష్మజీవుల పేరేమిటి?
(రైజోబియమ్)
300. జీవన ఎరువు అంటే ఏమిటి? (బ్లూగ్రీన్ ఆల్గేతో చేసిన సహజ ఎరువు)
301. జొన్నలో క్రోమోజోముల సంఖ్య (20)
302. వరిలో క్రోమోజోముల సంఖ్య (24)
303. ఉల్లిలో క్రోమోజోముల సంఖ్య (16)
304. రౌండ్‌వర్మ్‌లో క్రోమోజోముల సంఖ్య (2)
305. డ్రాసోఫిలాలో క్రోమోజోముల సంఖ్య (8)
306. సూర్యుడు సెకనుకు ఎంత హైడ్రోజన్ ఖర్చు చేస్తాడు?
(నలభై లక్షల టన్నులు)
307. ఇండియన్ ఇంక్‌లో ఏ మూలకం ఉంది? (కార్బన్)
308. 'నెక్రోస్కోప్' ఎందుకు వాడతారు?
(అంతరిక్ష వస్తువుల, మేఘాల వేగాలను కనుగొనుటకు)
309. ఎముకల బూడిదలో ఎక్కువగా వుండే పదార్థం ఏది?
(కాల్షియం ఫాస్ఫేట్)
310. ఎలక్ట్రిక్ బల్బులో వుండే వాయువులు ఏవి? (ఆర్గాన్, హీలియం)
311. 'జింక్ కార్బొనేట్' ఎందుకు ఉపయోగపడుతుంది?
(చర్మ వ్యాధుల నివారణకు)
312. 'బిస్మత్ ఆక్సిక్లోరైడ్' ఎందుకు ఉపయోగిస్తారు?
(ముత్యాలను తయారుచేయడానికి)

313. 'క్షీర గ్రంథులు' ఏ గ్రంథులు మార్పుచెంది ఏర్పడినవి? (సెబీసియస్ గ్రంథులు)

314. ఈగ డింబకము ఏది? (మాగట్)

315. బోధకాలు కలిగించు జీవి ఏది? (ఊకరేరియా బ్రాంకాఫ్టి)

316. టీనోఫోరా డింబకం ఏది? (సిడ్డిపిడ్)

317. RNA లో వుండే నాలుగు క్షారాలు ఏవి? (అడినైన్, గువానిన్, సైటోసీన్, యురాసిల్)

318. హరగోవింద ఖొరానాకు దేనికి నోబెల్ బహుమతి లభించినది? (జన్యు సంశ్లేషణ)

319. ఓలిగోట్రోఫిక్ సరస్సులనగా- (ఎక్కువ ఉత్పాదనశక్తిగల సరస్సులు)

320. క్షీరదాలలో అతి పెద్ద జంతువు ఏది? (బెలనోప్టిరా)

321. వృక్ష కణంలో నీటి శాతం ఎంత? (90 శాతం)

322. పాలలోని ప్రోటీన్‌పై చర్య జరిపే ఎంజైమ్ ఏది? (రెనిన్)

323. జీవ పదార్థంలో అధికంగా వుండే కర్బన పదార్థం ఏది? (ప్రోటీన్‌లు)

324. నవీన మానవుడు ఏ యుగంలో ఆవిర్భవించాడు? (సీనోజాయిక్)

325. చేపలు ఆవిర్భవించిన కాలం ఏది? (డివోనియన్ యుగం)

326. డైనోసార్‌లు జీవించి వున్న కాలం ఏది? (మిసోజాయిక్ యుగం)

327. ఉభయజీవులు ఆవిర్భవించిన కాలం ఏది? (డివోనియన్ యుగం)

328. ఆధునిక గుర్రం ఏ యుగంలో ఆవిర్భవించినది? (సీనోజాయిక్)

329. ఉద్రేకపడినప్పుడు విడుదలయ్యే హార్మోన్ ఏది? (ఎడ్రినలిన్)

330. సరీసృపాల అధ్యయన శాస్త్రం ఏది? (హెర్పటాలజీ)

331. సముద్ర మట్టం వద్ద వాతావరణ పీడనమెంత? (760 ఎం. ఎం. పాదరసపు ఎత్తు)

332. మెదడులోని ఉష్ణక్రమతా కేంద్రకం ఏది? (హైపోథాలమస్)

333. బ్రీడర్ రియాక్టర్ అంటే ఏమిటి? (అణు ఇంధనాన్ని ఒకసారి వేసిన తరువాత అదే శక్తిని విడుదల చేస్తూ మరలా ఇంధనంగా మార్చే రియాక్టర్)

334. ఫాస్ట్ రియాక్టర్ అంటే ఏమిటి? (న్యూట్రాన్‌ల వేగాన్ని పెంచి అణుగర్భాన్ని ఛేదించే రియాక్టర్)

335. భారజలానికి గల మరో పేరేమిటి? (డ్యుటీరియమ్)

336. అణుగర్భంలోని చిన్న రేణువు ఒక దానికి భారతీయ శాస్త్రవేత్త బోస్ పేరు పెట్టారు. ఆ అణువు పేరేమిటి? (బోసాన్)

337. 'కోల్డ్‌ఫ్యూషన్' అంటే ఏమిటి?

(సాధారణ ఉష్ణోగ్రత వద్ద హైడ్రోజన్ అణువుల్ని కలపడం)

338. హైడ్రోజన్ బాంబు అంటే ఏమిటి?

(ఫ్యూషన్-సంయోగ క్రియద్వారా శక్తిని విడుదల చేయడం)

339. భారతదేశపు తొలి అణు రియాక్టర్ ఏది? (అప్సర)

340. ధృవ రియాక్టర్ ప్రత్యేకత ఏమిటి? (ఇది దేశంలోని అతి పెద్ద అణు పరిశోధక రియాక్టర్. బాభా అణు పరిశోధనా కేంద్రం వద్ద ఉంది)

341. తొలి అణుబాంబు ఎప్పుడు ప్రయోగించారు?

(1945 ఆగస్టు 6 వ తేదీ హిరోషిమాపై)

342. మన దేశంలోని అణు విద్యుత్కేంద్రాలు ఏవి?

(దేశంలో ఐదు అణు విద్యుత్కేంద్రాలున్నాయి. అవి 1. తారాపూర్ 2. కోట, రాజస్థాన్, 3. మద్రాసు, 4. కల్పకం 5. నరోరా

343. భూ ఉపరితలపు వాతావరణం గురించి వెలువడిన తొలిగ్రంథం ఏది?

(ది అప్పర్ ఎట్మాస్ఫియర్-1947 లో శిశిర్ కుమార్ మిత్రా రచించారు)

344. పురుష లక్షణాల అభివృద్ధికి తోడ్పడే హార్మోన్?

(ముష్కం నుండి వెలువడే టెస్టోస్టిరాన్ హార్మోన్)

345. పండ్లను త్వరగా పక్వం చేయడానికి ఉపయోగించేది? (ఇథీన్)

346. స్త్రీ లక్షణాల అభివృద్ధికి తోడ్పడే హార్మోన్

(స్త్రీ బీజకోశాల నుండి వెలువడే ఈస్ట్రోజన్ హార్మోన్)

347. అన్ని ఆమ్లాలలో ఉండే మూలకం ఏది? (ఉదజని)

348. భూమి నుంచి టెలిస్కోప్ లేకుండా కనిపించే గ్రహాలు ఏవి?

(బుధుడు, శుక్రుడు, కుజుడు, గురుడు, శని)

349. యాడమ్స్ ఆపిల్ అని ఏ అవయవానికి పేరు? (థైరాయిడ్)

350. వేపలో చేదునిచ్చే రసాయనాలు ఏవి? (నింబిడిన్; నింబిన్; నింబినిన్)

351. రొమ్ము కాన్సర్‌కు ఉపయోగించే కొత్తమందు పేరేమిటి? (టక్సోల్)

352. కొత్తగా వచ్చిన యాంటిబయాటిక్ మందు పేరేమిటి? (రాక్సిత్రోమైసిన్)

353. ద్రాక్షనుంచి లభించే చక్కెర ఏది? (గ్లూకోజ్)

354. 'ప్రైడ్ ఆఫ్ ఇండియా' అని ఏ పువ్వుకి పేరు? (గులాబి)

355. ద్రాక్షలో ఉన్న ఆమ్లం ఏది? (హైడ్రోసైనిక్ యాసిడ్)

356. రీడింగ్ గ్లాస్‌గా ఏ లెన్స్‌ను వాడతారు?

(తక్కువ ఫోకల్ లెంగ్త్ కలిగిన పెద్ద కుంభాకార కటకం)

357. సూపర్ కండక్టివిటీని కనుగొన్నదెవరు?
(1911 లో డచ్ శాస్త్రవేత్త Heike Kam Erlingh Onnes)

358. గాయం త్వరగా మానటానికి ఉపయోగపడే విటమిన్ ఏది?
(విటమిన్ 'కె')

359. 'Radio Cobalt'ను ఏ వ్యాధి నివారణకు ఉపయోగిస్తారు? (కాన్సర్)

360. భూమిపై కాకుండా ఇతరేతర గ్రహాలలో ప్రాణకోటిని గురించిన శాస్త్రం
(Exobiology)

361. అంతరిక్షంలోని 'బ్లాక్‌హోల్స్'ని గురించి పరిశోధనలు జరిపి, నోబెల్ బహుమతి పొందిన శాస్త్రవేత్త? (ప్రొ॥ చంద్రశేఖర్)

362. 'Liquid Gold' అని దేనికి పేరు గలదు? (పెట్రోలియం)

363. పోలియో వ్యాధి సాధారణంగా ఏ భాగానికి వస్తుంది? (ఎముక)

364. వాతావరణంలోగల దిగువ పొర పేరేమిటి? (Troposphere)

365. హేలీ నక్షత్రం ఎన్ని సంవత్సరాలకు ఒకమారు కనిపిస్తుంది?
(76 సం॥లు)

366. శ్వాసక్రియను అదుపులో ఉంచే అవయవం ఏది?
(మెదడులోని 'మెడుల్లా')

367. గాలిలో $0^0$ వద్ద ధ్వని వేగం ఎంత? (300m/Sec)

368. మెడను చుట్టూ తిప్పి పరిసరాలను చూడగల జంతువు ఏది? (జెర్బోనా)

369. గ్రహాలలో హెచ్చు సంఖ్యలో ఉపగ్రహాలు కల్గివున్న గ్రహం ఏది?
(శని_20)

370. ఉపగ్రహాలు లేని గ్రహాలు ఏవి? (బుధుడు, శుక్రుడు)

371. క్విజింగ్ గ్లాసు అంటే (ఏకాక్షి కంటి అద్దం)

372. 1835లో హేలీతోకచుక్క కనబడినపుడు జన్మించిన అమెరికన్ రచయిత 1910లో జోస్యంచెపుతూ మళ్ళీ ఆ తోకచుక్క కనబడినపుడే మరణిస్తానని చెప్పినదెవరు? (మార్క్_ట్వైన్)

373. అంజనా పిక్టోరిస్ అను వ్యాధి ఏ భాగానికి వస్తుంది? (గుండె)

374. మైసీలియమ్ అంటే ఏమిటి? (పంగైజాతి మొక్కలలో కొన్ని హైఫీల సముదాయం)

375. 'నోబుల్ గ్యాస్' అని దేనికి పేరు వుంది? (ఆర్గాన్)

376. లైట్నింగ్ కండక్టర్‌ను కనిపెట్టినదెవరు? (బెంజిమన్ ఫ్లాంక్లిన్)

377. మొదటి స్పుత్నిక్ రోదసీలోకి పంపిన సంవత్సరం (1957)

378. మంచుపై నివసించే మొక్కలను ఏమంటారు? (హీలియో ఫైట్స్)
379. అతి చిన్న పుష్పించు మొక్క ఏది? (ఉల్ఫియ)
380. చెరుకు పంటకు వచ్చే ఎర్రకుళ్ళు తెగులు కలుగజేయు శిలీంధ్రం ఏది?
(కొలిటోట్రైకం ఫాల్ కేటమ్)
381. ఆస్కారిస్ జీవిత చరిత్రలో కనిపించే లార్వా ఏది?
(రాబైటిఫారంలార్వా)
382. పిండాభివృద్ధి దశలో ఏర్పడే అసాధారణ లక్షణాలు వివరించు శాస్త్రం?
(టిరటాలజీ)
383. ఒకజీవిలో వ్యాధి నిరోధకత పెంచుటకు తోడ్పడే తెల్లకణాలు?
(లింఫోసైటులు)
384. రసాయన శాస్త్రంలో తొలి నోబెల్ బహుమతి గ్రహీత ఎవరు?
(జె హెచ్.వాంట్ హాఫ్)
385. సూర్యుని నుండి వచ్చే కాంతిలో ఎక్కువగా ఏ కిరణాలు విద్యుచ్ఛక్తిగా మార్చడానికి ఉపయోగపడతాయి? (అతినీలలోహిత కిరణాలు)
386. జూపిటర్‌ను గురించి తెలుసుకోవడానికి మొదటిసారిగా పంపబడిన అంతరిక్షనౌక ఏది? (పయనీర్–10)
387. ఆక్వారీజియాలో హైడ్రోక్లోరిక్ ఆమ్లంతో పాటు వాడే మరియొక ఆమ్లం ఏది? (నత్రికామ్లము)
388. తిమింగలం చర్మం క్రింద వుండే ఉష్ణనిరోధక పొరను ఏమంటారు?
(బ్లబ్బర్)
389. బి.సి.జి. అనగా – (బాసిలస్ కార్మెట్ట గెరిన్)
390. 'యాపిల్' ఉపగ్రహాన్ని ఎచ్చట నుండి ప్రయోగించారు
(ఫ్రెంచిగయానా)
391. 'రెడ్ ప్లానెట్' అని దేనికి పేరు? (మార్స్)
392. కాలిగ్రఫీ అనగా – (అందంగా వ్రాయుట)
393. యాస్ప్రిన్‌లో వుండే రసాయనం (ఎసిటల్ శాలిసిలిక్)
394. "ఆరిజిన్ ఆఫ్ స్పెసీస్" రచయిత ఎవరు? (చార్లెస్ డార్విన్)
395. మన శరీరంలో కణజాలం మధ్య వుండే ద్రవం పేరేమిటి? (లింఫ్)
396. మనదేశంలో మొట్టమొదటి జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు ఏ రాష్ట్రంలో ఉంది?
(హిమాచలప్రదేశ్)
397. ఏ వ్యాధిగ్రస్థుల మూత్రంలో గ్లూకోజ్ రసాయనం కనిపిస్తుంది?
(చక్కెర వ్యాధిగ్రస్థులు)

398. కర్బన శిలల నుండి బొగ్గునూనె ఉత్పత్తి చేసే నేలను ఏమంటారు?
(అవక్షేప శిలలు)

399. 'ఫ్లవర్ పంగై' అని దేనికి పేరుంది? (పుట్టగొడుగులు)

400. గేదెలకు వచ్చే ప్రమాదకరమైన వ్యాధి (సర్రా వ్యాధి)

401. 'అంకోజీన్' అంటే ఏమిటి? (కేన్సర్ కలిగించే జన్యువు)

402. అతి ప్రాచీన కాలంలో భారతదేశం, ఆస్ట్రేలియా, అంటార్కిటికాలు దగ్గరగా వున్న ఖండాన్ని ఏమంటారు? (గోండ్వానా లాండ్)

403. ఎర్ర రక్తకణాలు ఎక్కువగా ఎక్కడ తయారవుతాయి? (ఎముక మజ్జ)

404. జీర్ణాశయంలో నీరు ఎక్కువగా పీల్చబడే భాగం ఏది? (పెద్దప్రేవు)

405. ఫొటోగ్రఫీలో వాడే రసాయనం ఏది? (సోడియం థైయోసల్ఫేట్)

406. ఫోటోఫిల్మ్‌లో ఉపయోగించే రసాయనం ఏది? (సిల్వర్ నైట్రేట్)

407. అగ్నిమాపక యంత్రంలో ఉపయోగించే వాయువు పేరేమిటి?
(కార్బన్ డై ఆక్సైడ్)

408. భూమినుంచి భూమి మీదకు ప్రయోగించిన భారతీయ తొలి క్షిపణి ఏది?
(పృధ్వీ)

409. వాతావరణ కాలుష్యం వల్ల సంభవిస్తున్న ఆమ్ల వర్షాలలో వుండే వాయువు ఏది? (నైట్రస్ ఆక్సైడ్ మరియు సల్ఫర్ డయాక్సైడ్)

410. 'బోన్సాయ్' అనగా- (చిన్న కుండలలో మరుగుజ్జు వృక్షాలను పెంచడం)

411. మెదడు నుంచి నేరుగా అవయవాలకి వచ్చే ప్రధాన నాడులెన్ని?
(పది నాడులు, వీటిని క్రేనియల్ నెర్వ్స్ అంటారు)

412. రొట్టెల తయారీలో ఉపయోగించే ఆమ్లం ఏది? (టార్టారిక్ ఆమ్లం)

413. Helio Tropism' అనగా- (సూర్యకాంతి ఆధారంగా మొక్కల్ని పెంచడం)

414. సెక్స్ క్రోమోజోముల ద్వారా సంక్రమించే వ్యాధి (కలర్ బ్లైండ్‌నెస్)

415. బెలూన్‌లో నింపే వాయువు పేరేమిటి? (హీలియం)

416. ఇంటర్నేషనల్ ఆటమిక్ ఎనర్జీ ఏజెన్సీ (IAEA) ఎక్కడ ఉంది?
(వియన్నా)

417. సెంటిగ్రేడ్ స్కేలును ఎవరు కనుగొన్నారు? (సెల్సియస్)

418. అమెరికా అంతరిక్ష టెలిస్కోప్ పేరేమిటి? (హబుల్)

419. శీతనిద్ర (Hybernation) అంటే ఏమిటి? (శీతాకాలంలో జంతువులు జీవ కార్యకలాపాలను స్తంభింప జేసుకొని నిశ్చలంగా వుండటాన్ని శీతనిద్ర అంటారు)

420. 'హైడ్రోసెఫాలస్' అంటే ఏమిటి?
(పుట్టుకతోనే శిశువు తల పెద్దదిగా వుండే స్థితిని హైడ్రోసెఫాలస్ అంటారు)
421. భూ గురుత్వాకర్షణశక్తి ఎంత? (9.8 $ms^2$)
422. మానవ శరీరంలో 'బోటులిజమ్' అంటే ఏమిటి?
(బాక్టీరియా ఉత్పత్తి చేసే విషాలతో ఆహార పదార్థాన్ని విషవంతం చేసే పద్ధతిని(BOTULISM అంటారు)
423. ఏ జంతువు పాలు గులాబీరంగులో ఉంటాయి? (కంగారు)
424. విశ్వాంతరాళంలో సుదూరంలో గల అత్యంత ప్రకాశవంతమైన వస్తువులు ఏమిటి? (క్వాజర్లు)
425. 'స్త్రై' అనగానేమి? (పిండాలను మగబిడ్డలుగా రూపొందించే జన్యువు)
426. తోకచుక్కలు ఏర్పడే మండలం పేరేమిటి? (వూర్ట్‌మేఘమండలం)
427. శరీరంలోనికి వాయువుల రాకపోకలను ఏమంటారు? (అస్మాసిస్)
428. మానవ శరీరంలో క్రొవ్వు నిల్వ వుండేది? (ఎడిపోజ్ టిష్యూ)
429. లిథోస్ఫియర్ (ఎర్త్‌క్రస్ట్)లో లభ్యమయ్యే మూలకం ఏది? (ఆక్సిజన్)
430. మోనోకల్చర్ అనగా— (ఒకే పంట పండించుట)
431. లాఫింగ్ గ్యాస్ అని దేనికి పేరు? (నైట్రస్ ఆక్సైడ్)
432. నెప్ట్యూన్ గ్రహానికి గల మరొక పేరేమిటి? (బేబీ బ్లూప్లానెట్)
433. అంగారకుడి ఉపగ్రహాల పేరేమిటి? (డిమోస్, ఫోబోస్)
434. గ్యాస్‌వెల్డింగ్‌కు ఉపయోగించు వాయువులు ఏవి? (ఎసిటలిన్, ఆక్సిజన్)
435. మెర్క్యూరీ పాయిజనింగ్‌వల్ల వచ్చే వ్యాధి పేరేమిటి? (Minamata)
436. 'గెలాక్సీలు' అనగా — (విశ్వంలో అసంఖ్యాకంగా వున్న నక్షత్రరాశులు)
437. 'నెబ్యులా' అనగా — (గెలాక్సీల్లో వుండే వాయు, ధూళి మేఘాలు)
438. 'పాలపుంత' అనగా నేమి? (భూమితోకూడిన సౌరమండలం వున్న గెలాక్సీ)
439. క్రోమియంతో కలిసిన ఇనుముగల లోహం పేరేమిటి? (స్టెయిన్‌లెస్ స్టీలు)
440. ఫ్లోరసెంట్ ట్యూబ్‌లో వుండే వాయువు ఏది? (మెర్క్యూరీ వేపర్)
441. ఎలక్ట్రిక్ బల్బులోని ఫిలమెంటును దేనితో తయారు చేస్తారు? (టంగ్‌స్టన్)
442. 'జెనిటిక్ కోడ్'ను కనుగొన్నదెవరు?

443. శరీరంలోని వివిధ జీవకలాపాలను సమన్వయపరచే ప్రత్యేక రసాయనాలు (హార్మోన్‌లు)

444. "UARS" అంటే ఏమిటి? (అప్పర్ ఎట్మాస్ఫిరిక్ రిసెర్చ్ శాటిలైట్)

445. శుక్రునిపై దిగిన మొదటి మానవ రహిత వ్యోమనౌక ఏది? (పయనీర్-I; అమెరికా)

446. అణుధార్మిక శక్తిని కొలిచే యూనిట్ పేరేమిటి? (ఫెర్మి)

447. మనిషి కనిపెట్టిన మొదటి లోహం ఏది? (రాగి)

448. పులియబెట్టటమంటే.... (ఆక్సిజన్‌లేని వాతావరణంలో ఈస్ట్ కణాలను పెంచడం)

449. 'నోవా' అనగా నేమి? (నక్షత్రాల ప్రేలుడు)

450. తొలి ఓపెన్ హార్ట్ సర్జరీ ఎప్పుడు ఎక్కడ జరిగింది? (1953లో అమెరికాకు చెందిన డాక్టరు వాల్టన్‌విలీహెల్ ఈ ఆపరేషన్ నిర్వహించారు)

451. స్త్రీ గర్భం దాల్చినప్పుడు ఫ్లూ జ్వరానికి గురైతే పుట్టే పిల్లలకు వచ్చే మానసిక వ్యాధి ఏమిటి? (స్కిజో ఫ్రీనియా)

452. చెర్నోబిల్ అణుకేంద్రంలో ప్రమాదం జరిగిన సంవత్సరం ఏది? (1986)

453. మెగ్నీషియం తక్కువైతే వచ్చే వ్యాధి ఏది? (అలసట)

454. మొట్టమొదటిసారి నక్షత్రాలను వాటి వెలుగును బట్టి వర్గీకరించినదెవరు? (హిప్పార్చస్. క్రీ.పూ. రెండవ శతాబ్దానికి చెందిన గ్రీకు శాస్త్రవేత్త)

455. అతి అరుదైన ఖనిజం ఏది? (స్కాంట్లాండైట్)

456. దీర్ఘదృష్టి అంటే ఏమిటి? (దగ్గరి వస్తువుల్ని కన్ను చూడలేక పోవడాన్ని దీర్ఘదృష్టి అంటారు)

457. 'సూపర్ హాలోజెన్' అని దేన్ని అంటారు? (ఫ్లోరిన్)

458. 'రేడియో-ధార్మిక హాలోజెన్' అని దేన్ని అంటారు? (అస్టటైన్)

459. నైట్రోజన్‌కు గల పూర్వపు పేరేమిటి? (అజోట్)

460. బ్లాస్టింగ్ గెలటిన్ అంటే ఏమిటి? (అతిశక్తివంతమైన ఓ ప్రేలుడు పదార్థం)

461. 'డిసాల్టినేషన్' అనగానేమి? (సముద్ర నీటినుంచి ఉప్పును తొలగించే పద్ధతి)

462. 'ఎపిడెమియాలజీ' అంటే ఏమిటి?
(కాలానుగుణంగా ఒకేసారి అనేకమందికి వచ్చే వ్యాధుల గురించి పరిశోధించే వైద్యశాస్త్రశాఖ)

463. 'క్లోరోఫారం'ను అనెస్తీషియాగా వాడిన తొలి డాక్టరు ఎవరు?
(స్కాట్లండ్‌కు చెందిన జేమ్స్ సిమ్సన్ – 1847)

464. కన్నీరు స్రవించే గ్రంథులు ఏవి? (లాక్రిమల్ గ్రంథులు)

465. అత్యధిక జీవక్రియ రేటుగల జీవి ఏది? (చుంచెలుక)

466. 'రోమాలు లేని క్షీరదం' ఏది? (తిమింగలం)

467. 'సజీవ శిలాజం' అని ఏజీవిని అంటారు? (స్ఫీనోడాన్)

468. మొట్టమొదటిసారిగా కృత్రిమ హైబ్రిడ్ చెట్టును 1717లో సృష్టించిన శాస్త్రవేత్త పేరేమిటి? (థామస్ ఫెయిర్ చెయిల్డ్)

469. అతివేగంగా పెరిగే చెట్టు ఏది?
(హెస్పరోగ్ స్కానిప్లెయ్ - 14 రోజుల్లో 12 అడుగులు పెరుగుతుంది)

470. బంగారం సాంద్రత ఎంత? (19.3)

471. నాగసాకి పట్టణంపై ప్రయోగించిన ఆటంబాంబు పేరేమిటి?
(ఫాట్‌బాయ్)

472. 1975లో ప్రమాదానికి గురైన బ్రౌన్‌ఫెర్రీ అణురియాక్టర్ ఎక్కడ ఉంది?
(అమెరికాలోని అలబామా రాష్ట్రంలో)

473. ఎలక్ట్రిక్ టైపురైటర్ ఏసంవత్సరంలో మార్కెట్‌లోకి వచ్చింది?
(1935లో)

474. 'అగాధ మండలం' అంటే ఏమిటి? (1800 మీటర్లకు పైబడిన లోతుగల సముద్రప్రాంతం)

475. అతి ఎత్తైన అగ్నిపర్వతం ఏది?
(ఆండీస్ పర్వత శ్రేణిలోని ఓజోస్ డెల్‌సాల్‌డో-6885 మీటర్లు)

476. అత్యధిక లోతు వున్న సరస్సు ఏది? (రష్యాలోని బైకాల్ సరస్సు- 1741 మీటర్లు)

477. భూభ్రమణం గురించి చెప్పిన భారతీయ శాస్త్రవేత్త (ఆర్యభట్టు)

478. గరిమనాభి అంటే ఏమిటి?
(వస్తువు దాని బల, భ్రామకాల మొత్తం శూన్యం అయ్యే బిందువును గరిమనాభి అంటారు)

479. శరీరాల్లో ఎక్కువ శాతం ఉండే ప్రోటీన్ ఏది? (మయోసిన్)

480. ఆమ్ల వర్షాన్ని మొదట ఏ దేశంలో ఎప్పుడు గుర్తించారు?
(1926 లో నార్వేలో)

481. తొలి అణుపరీక్ష జరిపిన దేశం ఏది?
(1945 జూలై 16న న్యూ మెక్సికోలోని అల్మగారో వద్ద మన్‌హట్టన్ ప్రాజెక్టు క్రింద తొలి అణుపరీక్షను అమెరికా జరిపింది)

482. క్రిమిసంహార మందులను అధికంగా ఎగుమతి చేస్తున్న దేశం ఏది?
(అమెరికా)

483. మనిషి శరీరంలో 'స్టాబిస్మస్' అంటే ఏమిటి? (ఒకే సమయంలో ఒక వస్తువు పైకి రెండు కళ్ళు దృష్టిని కేంద్రీకరించలేని స్థితి)

484. కెల్విన్ అనగా నేమి? (నీటి ఉష్ణోగ్రతకు సంబంధించిన 273.16 సంఖ్యని కెల్విన్ అంటారు)

485. రేడియో ఆస్ట్రాన్ అనగా నేమి? 1994 లో పూర్వపు సోవియట్ ప్రయోగించాలనుకున్న ఉపగ్రహం)

486. Save Rivers Movement"ను ప్రారంభించినదెవరు?
(సుందర్‌లాల్ బహుగుణ)

487. "VSOP" అనగా –(1995 లో జపాన్ ప్రయోగించనున్న ఉపగ్రహం)

488. అన్ని ఆమ్లాలలో వుండే మూలకం ఏది? (హైడ్రోజన్)

489 నిశ్చలతలు ఎన్ని రకాలు? (స్థిర, అస్థిర, తటస్థ అని నిశ్చలతలు మూడు రకాలు)

490. చర్మానికి రంగునిచ్చే కణాలు ఏవి? (మెలనోసైట్స్)

491. కుంభాకార కటకానికి చాలా దగ్గరగా ఉన్న వస్తువు ప్రతిబింబాన్ని ఏమంటారు? (మిథ్యా ప్రతిబింబం)

492. పశువులలో పాల జ్వరం (మిల్క్ ఫీవర్) ఏ లోపంవల్ల వస్తుంది?
(కాల్షియం)

493. కృత్రిమంగా చేపలను ఇతర పద్ధతులలో అభివృద్ధి చేయడాన్ని ఏమంటారు? (పిసికల్చర్)

494. వక్రతలం అంటే ఏమిటి? (ఒక వస్తువు యొక్క ఉపరితలం వంకరగా ఉంటే దానిని వక్రతలం అంటారు)

495. మొలకెత్తు విత్తనాలు విడుచు వాయువు ఏది? (కార్బన్ డై ఆక్సైడ్)

496. హృదయస్పందన దేని ఆధీనంలో ఉంటుంది? (సెరిబెల్లం)

497. 'ఎపిడియాస్కోపు'ను దేనికొరకు ఉపయోగిస్తారు?
(అపారదర్శక ప్రతిబింబం తెరమీద పడునట్లు చేయుటకు)

498. 'వాటర్ గ్యాస్' అనగా నేమి?

(హైడ్రోజన్, కార్బన్ మోనాక్సైడ్‌లను కలిపిన మిశ్రమం)

499. వాతావరణంలో 'లీడర్ స్ట్రోక్' అంటే ఏమిటి? (భూమినుంచి విద్యుత్ ఆకాశంలోకి లేచి మెరుపు రావడానికి కారకం అవుతుంది. దీన్నే లీడర్ స్ట్రోక్ అంటారు)

500. అంతర్జాతీయ ప్రమాణాలలో 'మోల్' అంటే ఏమిటి? (కార్బన్ - 12 రకం మూలకంలో కిలోగ్రామ్‌కి 0.021 అణువులుండే పదార్థాన్ని 'మోల్' అంటారు)

501. భూస్థిర కక్ష్య అనగానేమి?

(భూమి తన చుట్టూ తాను తిరిగే వేగానికి సమానంగా ఉపగ్రహ వేగం ఉండటం)

502. వక్రతలం అంటే ఏమిటి? (ఒక వస్తువుయొక్క ఉపరితలం వంకరగా ఉంటే దానిని వక్రతలం అంటారు)

503. శుక్రుడిపై రాత్రి కాలం ఎంత? (225 రోజులు)

504. రోదసీ యాత్ర చేసిన మొదటి జంతువు ఏది? (లైకా అనే కుక్క)

505. అంతరిక్షయాత్ర చేసిన తొలి అమెరికన్ మహిళ పేరేమిటి?

(శాలిరైడ్)

506. కుజ, శుక్ర గ్రహాలపై వాతావరణంలో అధికంగా వున్న వాయువు ఏది?

(కార్బన్ డై ఆక్సైడ్)

507. 'సోమ్నాంబులిజం' అనగా నేమి? (నిద్రలో నడవడం)

508. నక్షత్రాలకి, గ్రహాలకి తేడా ఏమిటి? (నక్షత్రాలు కాంతిని పుట్టిస్తాయి. గ్రహాలు అలాకాక కాంతిని గ్రహిస్తాయి. ప్రతిఫలిస్తాయి)

509. మనిషి జీర్ణాశయంలో స్రవించే ఆమ్లం ఏది? (హైడ్రోక్లోరికామ్లం)

510. కేన్సర్ చికిత్సకై వాడే రేడియో ధార్మికమూలకం పేరేమిటి?

(కోబాల్ట్. అందుకే ఈ చికిత్సని కోబాల్ట్ ట్రీట్‌మెంట్ అంటారు)

511. హైపర్ విమానం అనగానేమి? (రోదసీలోకి వెళ్ళి రాగల విమానం)

512. హైపర్ విమానం రూపకర్త ఎవరు?

(ఎ.పి.జె. అబ్దుల్‌కలామ్, ఎయిర్ కమాండర్ ఆర్. గోపాలస్వామి)

513. కట్టడాల ఎత్తును కొలుచుటకు ఉపయోగించే సాధనం ఏది?

(గోనియో మీటర్)

514. వాయువుల మధ్య రసాయనిక మార్పులను కొలిచే సాధనం ఏది?

(ఈడియో మీటర్)

515. మట్టిలేకుండా మొక్కలను పెంచే శాస్త్రాన్ని ఏమంటారు? (హైడ్రోపోనిక్స్)

516. కక్ష్యలో ఉపగ్రహం దేనివల్ల తిరుగుతుంది? (గురుత్వ త్వరణము)

517. రక్తం గడ్డకట్టుటకు ఉపయోగవడే ఎంజైము ఏది? (ట్రాంబో ప్లాస్టిక్)

518. 'గేప్లేగ్' అని పిలవబడుతున్న వ్యాధి ఏది? (ఎయిడ్స్)

519. ఫూజాన్ అనగా – (కృత్రిమ రక్తం)

520. మన శరీరంలో ఏ భాగాన్ని "Sweet Bread" అని పిలుస్తారు? (క్లోమము)

521. హ్యూమన్ కంప్యూటర్‌గా పేరొందిన భారతీయ మహిళ? (శకుంతలాదేవి)

522. సౌరమానం అంటే ఏమిటి?
(రాశులమధ్య సూర్యుడు చేసే ప్రయాణ కాలాన్ని కొలిచేది సౌరమానం)

523. హైడ్రా చలనాంగాలు ఏవి? (స్పర్శకాలు)

524. చేవల చలనాంగాలు ఏవి? (వాజాలు)

525. చీకటిలో ఎముకలు కాంతిని వెదజల్లుటకు గల కారణం? (తెల్లభాస్వరం మండుటవల్ల)

526. పోరస్ రాళ్ళు అంటే ఏమిటి?
(సూక్ష్మాతి సూక్ష్మమైన రంధ్రాలు కలిగి ఆయిల్ చుక్కల్ని పట్టి ఉంచే రాళ్ళు)

527. సహజవాయువు అనగా నేమి?
(భూగర్భం నుంచి వాయువురూపంలో వెలువడే హైడ్రోకార్బన్‌ల మిశ్రమం)

528. యురాన్ అనగా నేమి? (బొంబాయి వద్ద క్రూడాయిల్‌ని స్థిరీకరించి రిఫైనరీలకు, ఎల్.పి.జి. కేంద్రాలకు పంపించే యంత్ర వ్యవస్థ ఉన్న ప్రాంతం)

529. ఫాసిల్‌రాక్స్ అనగా నేమి? (కొన్నివేల శతాబ్దాల క్రింద చనిపోయిన జంతువులు, మొక్కలు కుళ్ళిపోయి, రాళ్ళతో కలిసిపోయినచోట లభించే రాళ్ళని శిలాజాలు అంటారు)

530. 'కోల్‌సీమ్స్' అనగానేమి? (అమెరికాలోని సహజవాయు నిక్షేపాలు)

531. పోలీథిలీన్ దేని నుంచి తీస్తారు? (ఎథిలీన్)

532. డీసిల్ ఇంజన్ సృష్టికర్త? (రుడాల్ఫ్‌డీసెల్ – 1892)

533. 'సెడ్కో' అనగానేమి?
(ఆయిల్ డ్రిల్లింగ్‌కై అమెరికా నుంచి భారత్ తెచ్చుకొన్న ఆధునిక నౌక)

534. ప్రపంచంలోనే అతిపెద్ద సహజవాయు నిక్షేపం ఎక్కడ ఉంది?
(గ్రానెడ్ డెన్– ఉత్తర హాలెండ్)

535. ఆనంద్ ఎం. చక్రవర్తి అనే శాస్త్రవేత్త కనుగొన్న బాక్టీరియా ఏది?
(సూపర్ బగ్ – ఇది సముద్రాలపై చేరే ఆయిల్ కాలుష్యాన్ని హరిస్తుంది)

536. మలేరియా వ్యాప్తిచేసే దోమ పేరు? (క్యూలెక్స్ తెగ ఆడదోమ)

537. బాపట్ల దగ్గర ఉన్న వైమానికదళ శిక్షణ కేంద్రం పేరు? (సూర్యలంక)

538. ఐ.ఆర్.బి.ఎం. అనగా?
(ఇంటర్మీడియట్ రేంజ్ బాలిస్టిక్ మిస్సైల్–మధ్యతరహా క్షిపణి)

539. ఇ.ఆర్.డి.ఎల్. అనగా?
(ఎక్స్‌ప్లోజివ్స్ రీసెర్చి అండ్ డెవలప్‌మెంట్ లేబరేటరీ, పూనే)

540. ఐ.ఆర్.డి.ఇ. అనగా? (ఇన్‌స్ట్రుమెంట్ రీసెర్చి అండ్ డెవలప్‌మెంట్ ఎస్టాబ్లిష్‌మెంట్–డెహ్రాడూన్‌లో ఉంది)

541. ఇ.సి.సి.ఎం. అనగా? (ఎలక్ట్రానిక్ కౌంటర్ – కౌంటర్ మెజర్. ఇది ఆకాశ్, త్రిశూల్ క్షిపణులలో ఒక కొలమాన పద్ధతి)

542. గాలిలో ధ్వని వేగం? (సెకండుకి 332 మీటర్లు)

543. 'అగ్ని' క్షిపణికి రూపకల్పన చేసిన దెవరు?
(డా॥ ఎ.పి.జె. అబ్దుల్ కలామ్)

544. 'అగ్ని'క్షిపణిని ఎప్పుడు ప్రయోగించారు? (1989, మే)

545. 'ఆకాశ్' ప్రయోగం జరిగినదెప్పుడు? (1990, ఆగస్టు 14)

546. కోడిపిల్లలకు ఏ వయస్సులో ఫాల్‌పాక్స్ టీకా చేస్తారు?
(20 రోజులు వచ్చాక)

547. కోడిపిల్లలకు ఎఫ్.ఐ ఇంజక్షన్ ఎందుకు చేస్తారు?
(రాణి కేట్ వ్యాధిరాకుండా)

548. సౌరబ్యాటరీలు ఎలా పనిచేస్తాయి? (ఫోటో – వోల్టాయిక్ ప్రక్రియ)

549. ప్రాచీన కాలపు సౌర సరస్సు ఎక్కడ ఉంది? (ఇజ్రాయిల్)

550. భారతదేశంలో తొలి సౌర సరస్సు ఎక్కడ నిర్మించారు? (పుదుచ్చేరి)

551. ఆంధ్రప్రదేశ్‌లో తొలి సౌరగ్రామం ఏది? (జతోనవల్లి)

552. సౌర బ్యాటరీలలో దేనిని వాడతారు? (సిలికాన్)

553. అమెరికా – యూరప్ రోదసీ సంస్థలు పంపిన సూర్య పరిశోధన వ్యోమనౌక పేరేమిటి? (యులైసిస్)

554. 'ఎలక్ట్రానిక్ సిటీ ఆఫ్ ఇండియా'గా ప్రసిద్ధి చెందిన పట్టణం ఏది?
(బెంగుళూరు)

555 అణువుకి, అయాన్‌కిగల తేడా ఏమిటి? (అణువు విద్యుత్ ధర్మంరీత్యా తటస్థంగా ఉంటుంది. అయాన్‌కి విద్యుదావేశం ఉంటుంది)

556. విశ్వకిరణాలు అనగా నేమి? (ప్రకృతిలో సహజంగా రేడియో ధార్మికశక్తి విడుదలైనప్పుడు వచ్చే కిరణాలు)

557. రేడియో టెలిస్కోప్‌కి, మామూలు టెలిస్కోప్‌కి గల తేడా ఏమిటి? (రేడియో టెలిస్కోప్ ధ్వనిని, కాంతిని గ్రహిస్తుంది. మామూలు టెలిస్కోపు కాంతిని మాత్రమే గ్రహిస్తుంది)

558. రేడియాలసిస్ అంటే ఏమిటి? (ఇతర విధాలైన విద్యుదయస్కాంత రేడియేషన్ ఫ్రీక్వెన్సీల నుండి రేడియో ఫ్రీక్వెన్సీలను వేరుచేయడం)

559. నక్షత్రపు 'అక్కల్టేషన్' అంటే ఏమిట? (నక్షత్రం నుండి వచ్చే కాంతికి ఆకాశంలో మరో ఖగోళ వస్తువు అడ్డు పడటంవలన భూమిమీద పరిశీలకుడికి ఆ నక్షత్రం కన్పించకపోవడం)

560. 'న్యూరాన్' అంటే ఏమిటి? (నాడీకణం)

561. భారతదేశం అణుపరీక్ష జరిపిన సంవత్సరం ఏది? (1974)

562. నోబెల్ మెటల్స్ అంటే ఏమిటి? (సాధారణ స్థితిలో రసాయన మిశ్రమాలు ఏర్పరచని మూలకాలు)

563. ఎగిరే పళ్ళెం అంటే ఏమిటి? (విజ్ఞానశాస్త్రం నిర్వచించలేక పోయిన ఒక రోదసీ వస్తువు)

564. టాకీ చిత్రాలకర్త ఎవరు? (డీజ్ ఫారెస్ట్)

565. ఖండచలన (Continental Drift) సిద్ధాంతాన్ని తొలిసారి ప్రతిపాదించినదెవరు? (వెగెనర్)

566. ఆధునిక వర్గీకరణశాఖకు పితామహుడెవరు? (కార్లస్ లిన్నేయస్)

567. ప్రోటీన్ల జీవసంశ్లేషణం (biosynthesis) లో ప్రత్యక్షంగా ప్రముఖ పాత్ర వహించేవి? (రైబోసోమ్‌లు)

568. కణశక్త్యాగారాలు (Powerhouse of the cell) అని దేన్ని పిలుస్తారు? (మైటోకాండ్రియా)

569. DNA అణురచనా స్వరూపాన్ని కనుగొన్నదెవరు? (1953, వాట్సన్, క్రిక్)

570. సంవృత సంయోగం (Cleistogany) అంటే ఏమిటి? (పుష్పాలు వికసించకుండానే పరాగ సంపర్కం జరగడం)

571. ఢిల్లీలోని పాత ఖగోళ వేధశాల పేరు? (జంతర్‌మంతర్)

572. అంగారక గ్రహం ఏ రంగులో ఉంటుంది? (ఎరుపు)

573. హరిత విప్లవ పితామహుడు ఎవరు? (నార్మన్ బోర్లాగ్)
574. గ్లేసియర్ అంటే ఏమిటి? (పర్వతలోయ మధ్య ఏర్పడిన మంచు

575. మోటారు వాహనాలకు వాడే అద్దం ఏది? (కుంభాకార దర్పణము)
576. అంటార్కిటికాలో ఉన్న భారత స్థావరం పేరేమిటి? (దక్షిణ గంగోత్రి)
577. భారతీయ వైద్యశాస్త్రంలో శస్త్రచికిత్సా పితామహుడెవరు? (శుశ్రుతుడు)
578. జాతీయ పౌష్టికాహార సంస్థ ఎక్కడుంది? (హైదరాబాద్)
579. 'ఆస్పిరిన్'ను కనిపెట్టినదెవరు? (హెర్మాన్ డ్రెసర్)
580. ఒకే పోలికగల కవలలు పుట్టుటకు కారణం ఏమిటి?
(ఫలదీకరణ తరువాత అండం రెండుగా చీలడం)
581. అణు జలాంతర్గాములు కలిగిన దేశాలలో భారతదేశం ఎన్నవది?
(ఆరవది)
582. సున్నా డిగ్రీల సెంటీగ్రేడ్ వద్ద ద్రవరూపంలో వుండే రెండు మూలకాలు ఏవి? (పాదరసం, బ్రోమిన్)
583. 'పై' విలువను ఖచ్చితంగా వివరించిన భారతీయ శాస్త్రవేత్త ఎవరు?
(ఆర్యభట్ట)
584. అటోప్సీ (Autopsy) అనగా? (మానవ మృతదేహాన్ని పరీక్షించడం)
585. అంటార్కిటికాపై కాలుమోపిన తొలి మహిళ ఎవరు? (మెహమూన్)
586. మనశరీరంలో అతివిస్తారంగా వున్న మూలకం ఏది? (ఆక్సిజన్)
587. భూమధ్యరేఖను రెండుసార్లు దాటిన నది ఏది? (అమెజాన్)
588. సూపర్ కండక్టివిటీ అనగా – (తక్కువ ఉష్ణోగ్రతవద్ద పూర్తి నిరోధం కోల్పోవడం)
589. కాలిగ్రఫీ అనగా – (అందంగా వ్రాయటం)
590. బొటానికల్ సర్వే ఆఫ్ ఇండియా స్థాపకుడెవరు? (హుక్కర్)
591. ఈక్వినాక్స్ అనగా – (రాత్రి, పగలు సమానంగా ఉండటం)
592. ప్రొడ్యూసర్ గ్యాస్ అనగా –
(నైట్రోజన్, కార్బన్-డై-ఆక్సైడ్ల మిశ్రమం)
593. అయనోస్ఫియర్ అనగా – (రేడియో తరంగాలను పరావర్తనం చేయు వాతావరణ పొర)
594. అతిపెద్ద కణం ఏది? (నిప్పుకోడి అండం)
595. స్వదేశంలో తయారుచేసిన తొలి మిస్సైల్ బోట్ ఏది? (విభూతి)

596. 'Homograft అనగా' – (మరణించిన వ్యక్తి నుండి గుండె వాల్వులను తీసి బ్రతికున్న వారికి అమర్చడం)

597. 'లహర్' అనగా – (సంకరజాతి గులాబీ మొక్క)

598. శుక్రగ్రహం చుట్టూ పరిభ్రమిస్తున్న అంతరిక్ష నౌక పేరేమిటి? (మాజిలాన్)

599. 'హీమోఫేలియా' అనగా నేమి? (గాయం అయినచోట రక్తం ఆగకుండా స్రవించడం)

600. భూమి వయస్సును దేనిద్వారా లెక్కిస్తారు? (యురేనియం డేటింగ్)

601. 'గ్రీన్ బెల్ట్' అంటే ఏమిటి? (కాలుష్య నివారణకై చెట్ల పెంపకం)

602. కెమెరాలోని ఏ భాగంతో కంటి రెటీనాని పోలుస్తారు? (ఫోటో ఫిల్మ్)

603. ప్రపంచ జనాభా దినోత్సవం ఎప్పుడు జరుపుతున్నారు? (జులై 11)

604. పర్యావరణ దినోత్సవంగా ఏ రోజును పాటిస్తున్నారు? (జూన్ 5)

605. పొగాకు నిషేధ దినోత్సవం ఎప్పుడు? (మే 31)

606. గ్రామాలలో మంచినీటి బావుల్ని శుభ్రపరిచే ప్రక్రియ పేరేమిటి? (క్లోరినేషన్)

607. కటకాల (Lens) శక్తిని దేనితో కొలుస్తారు? (డయోప్టర్)

608. అణుకేంద్రాల వద్ద నివసించే వారికి వస్తున్న కేన్సర్ ఏది? (రక్తకేన్సర్)

609. దేశీయ పరిజ్ఞానంతో ప్రప్రథమంగా నిర్మించిన ఉపగ్రహం పేరేమిటి? (ఇన్‌శాట్ - 2ఎ)

610. విద్యుత్ కొలమానం ఏది? (ఆంపియర్)

611. టెలిఫోన్‌లో ఏ భాగం ధ్వనితరంగాలను యాంత్రిక తరంగాలుగా మారుస్తుంది? (డయాఫ్రమ్)

612. కడుపులోని కణాలకు చేరే ఆక్సిజన్‌ను గుర్తించే సాధనం ఏది? (క్రోనో మీటర్)

613. కాలేయంలో నిల్వవుండే విటమిన్ ఏది? ('ఎ' విటమిన్)

614. భూ వాతావరణంలో అధికంగా వుండే వాయువు ఏది? (నత్రజని)

615. ప్రాచీన వృక్షశాస్త్ర పితామహుడు అని ఎవర్ని అంటారు? (థియోఫ్రాస్టస్)

616. భూ గురుత్వాకర్షణశక్తి ఎంత? ($9.8\ ms^{-2}$)

617. ఎశ్చువరి అనగా నేమి? (సముద్ర, నదీజలాలు కలియు చోటు)

618. ఎస్కిమోలు నివసించే ఇళ్ళను ఏమంటారు? (ఇగ్లూలు)

619. వెంట్రుకల మూలలో వుండే కణాలు ఏవి? (పాపిల్లా)

620. $H_2O_2$ ఆకారం (తెరచివున్న పుస్తకం)
621. గుండెజబ్బులు కనుగొనడానికి ఇటీవల కనుగొన్న యంత్రం? (హార్ట్ ట్రాన్స్‌డ్యూసర్)
622. జూడస్ కలర్ అని దేనిని అంటారు? (ఎరుపు)
623. మన దేశంలో ప్రప్రథమ హెల్త్‌సైన్స్ యూనివర్సిటీని ఎక్కడ నెలకొల్పారు? (విజయవాడ)
624. అంతర్జాతీయ అంతరిక్ష సంవత్సరంగా ఏ సంవత్సరాన్ని పాటించారు? (1992)
625. బట్టలపై ఇంకు మరకలను తొలగించడానికి ఉపయోగించే పదార్థం ఏది? (హైపో ద్రావణం లేదా సోడియం థయో సల్ఫేట్)
626. మెదడులోని ఏ భాగంపై మద్యం ప్రభావం చూపుతుంది? (మెడుల్లా అబ్లాంగేటా)
627. గాజు పరిశ్రమలో ఉపయోగించే మూలకం ఏది? (సిలికా)
628. వన్యప్రాణుల పరిరక్షణకు కృషిచేసే అంతర్జాతీయ సంస్థ? (వరల్డ్ వైల్డ్‌లైఫ్ ఫండ్)
629. టేపు రికార్డరు టేపుపై పూతపూసే పదార్థం ఏది? (ఫెర్రిక్ ఆక్సైడ్)
630. 'రీక్లామేషన్' అనగా నేమి? (పనికిరాని నేలను సేద్యానికి అనువుగా తయారుచేయు ప్రక్రియ)
631. సరీసృపాల యుగం అని దేన్ని అంటారు? (మిసోజాయిక్)
632. మానవునిలోని వెన్నుపూసల సంఖ్య ఎంత? (33)
633. అత్యధిక ప్రోటీన్లు లభించే పదార్థం (పప్పు దినుసులు)
634. చెప్పులు లేకుండా తిరగడం వల్ల వచ్చే వ్యాధి ఏది? (ఎన్కైలోస్టొమియాసిస్)
635. కాంతి వేగాన్ని మొట్టమొదటిసారిగా కొలిచిన దెవరు? (రోమర్)
636. కార్బోహైడ్రేట్స్ శరీరంలో వేటిని పెంపొందిస్తాయి? (శక్తి)
637. 'ఐసోథీరమ్స్' అనగా నేమి? (ఒకే ఉష్ణోగ్రత గల ప్రదేశాలను కలుపు రేఖలు)
638. భారజలాన్ని తొలుత తయారుచేసిన శాస్త్రవేత్త ఎవరు? (యురే)
639. రెక్కలు లేని కీటకం పేరేమిటి? (లెపిస్మా)
640. కాళ్ళులేని ఉభయ జీవులు ఏవి? (ఇక్తియోఫిస్)
641. అంతరిక్షంలో పయనించిన తొలి జర్నలిస్ట్ ఎవరు? (తొయొహిరో అకియామా – జపాన్)

642. మెదడులోని పిట్యూటరీ గ్రంథి విడుదల చేసే హార్మోన్ పేరు? (లుటినైజింగ్ హార్మోన్)

643. స్వయంగా రక్తపోటు పరీక్షించుకోవడానికి ఉపయోగించే సాధనం పేరేమిటి? (డిజిటల్ మానో మీటర్)

644. మన జ్ఞాపకశక్తికి దోహదపడే ఎంజైమ్ ఏది? (కాల్‌పెయిన్)

645. చంద్రునిపై లభించే మూలకం పేరేమిటి? (ఆర్మకొలైట్)

646. భూకంపం పుట్టిన మూలబిందువును ఏమంటారు? (ఎపిసెంటర్)

647. పరమ ఉష్ణోగ్రత కొలమానం? (కెల్విన్)

648. విమాన ప్రమాదంలో మరణించిన భారతీయ అణుభౌతిక శాస్త్రవేత్త (హోమీబాబా)

649. టి.వి.లో ఉపయోగించే పిక్చర్ ట్యూబ్‌ల శాస్త్రీయనామం? (కేథోడ్ రే ట్యూబ్)

650. విటమిన్ 'సి' ఎందులో ఎక్కువగా ఉంటుంది? (బత్తాయి)

651. భూగర్భంలోని వస్తువులను పసిగట్టే రాడార్ యంత్రం? (గ్రౌండ్ ప్రోబింగ్ రాడార్)

652. బోంబే హైలో ఏమి కనుగొన్నారు? (ఆయిల్, సహజవాయువు)

653. హైడ్రాలిక్ సిమెంట్ అనగా నేమి? (నీటితో కలిసినపుడు గట్టిపడే సిమెంటు)

654. మనిషి కాకుండా రంగులను గుర్తించగల ఏకైక జంతువు ఏది? (కోతి)

655. మంచినీటిలోని జీవుల గురించి తెలుపు శాస్త్రం ఏది? (లిమ్నాలజీ)

656. ఎర్త్‌క్వేక్ జానీ అంటే ఎవరు? (భూ ప్రకంపన అధ్యయనానికి నాంది పలికిన జాన్‌మర్నీని ఎర్త్‌క్వేక్ జానీ అంటారు)

657. సైన్స్ చరిత్రలో "ఏజ్ ఆఫ్ అప్లికేషన్ ఆఫ్ సైన్స్' అని ఏ కాలాన్ని పిలుస్తారు? (19వ శతాబ్దం)

658. చైనీస్ వైట్ అని దేన్ని అంటారు? (జింక్ ఆక్సైడ్)

659. కణజాలాలు లేని బహుకణ జీవులు (పొరిఫెరా జీవులు)

660. పాలను పెరుగుగా మార్చే ఎంజైమ్ ఏది? (రెనిన్)

661. రక్తంలోని ద్రవరూప భాగాన్ని ఏమంటారు? (ప్లాస్మా)

662. BARC అంటే ఏమిటి? (బాబా అటామిక్ రీసెర్చ్ సెంటర్)

663. SHAR అంటే ఏమిటి? (శ్రీ హరికోట హై ఆల్టిట్యూడ్ రేంజ్)

664. మొక్కలు పిండిపదార్థాన్ని తయారుచేసుకొనే ప్రక్రియ పేరేమిటి? (కిరణజన్య సంయోగక్రియ)

665. ఫిబ్రవరి 28వ తేదీ ప్రాధాన్యత ఏమిటి? (నేషనల్ సైన్స్ డే)

666. ఈతకొట్టడం ఏ నీటిలో తేలిక? (సముద్రజలాలలో)

667. అంధులకు లిపి కనిపెట్టినదెవరు? (లూయీ బ్రెయిలీ)

668. రాష్ట్రపతి రాజీనామా ఎవరికి పంపుతారు? (ఉప రాష్ట్రపతి)

669. పారాచూట్‌ను కనుగొన్నదెవరు? (గార్నిరిన్—ఫ్రాన్స్)

670. అతి వేగవంతమైన చేప ఏది? (సాల్ట్‌ఫిష్ గంటకి 68 మైళ్ళు)

671. ఫిట్స్ ఎందుకు వస్తాయి? (విటమిన్ లోపం లేదా పైరాడిక్సిన్ లోపం వల్ల)

672 అతి తెలివైన జంతువు ఏది? (చింపాంజీ)

673. ఈ శతాబ్దపు నక్షత్ర విస్ఫోటనం (సూపర్ నోవా) ఎప్పుడు రికార్డు అయింది? (1988, ఫిబ్రవరి)

674. టెస్టుట్యూబ్‌లో వెదురుమొక్కల్ని పెంచిన భారతీయ పరిశోధకులు? (పూనేలోని నేషనల్ కెమికల్ లేబరేటరీ పరిశోధకులు నందగౌడ, పరాశరమ్మ)

675. సూపర్ కండక్టివిటీ రంగంలో పేరొందిన భారతీయ పరిశోధకులు? (సి. కుమార్, ఎన్. పటేల్)

676. సంచార జన్యువులు (Migratory Genes) గురించి చెప్పినదెవరు? (నోబెల్ బహుమతి గ్రహీత బార్బరా మెక్‌క్లిన్‌టాక్)

677. 'కోల్డ్‌ఫ్యూజన్'ను కనుగొన్నదెవరు? (స్టాన్లీపాన్స్, మార్టిన్ ఫ్లీష్‌మాన్—1989)

678. జలుబుకి వాడే వాక్సిన్ ఏది? (ఇంట్రా—నాసల్ ఇంటర్ ఫెరాన్)

679. మనిషి పాదంలో ఎన్ని ఎముకలున్నాయి? (26)

680. జన్యువైద్యం (జీన్‌థెరపి) అంటే ఏమిటి? (దీర్ఘ, అసాధ్య రోగాలకు చికిత్స చేయుటకు జీన్స్‌ను ఎక్కించే విధానం)

681. ప్రపంచంలో మొట్టమొదటి టి.వి. ప్రదర్శనను ఎవరు ఇచ్చారు? (జాన్ లోగి బెయిర్డు—1926)

682. గర్భస్థ శిశువుకి చేసే పరీక్ష ఏది? (యామ్నియో సెంటిసిస్)

683. ప్రపంచపు మొదటి టెస్ట్‌ట్యూబ్ బేబీ ఎవరు? (లూయీ బ్రౌన్ – 1978 జూలై 25)

684. భారత ఆడిటర్ అండ్ అకౌంటెంట్ జనరల్‌ను ఎవరు నియమిస్తారు? (రాష్ట్రపతి)

685. ఆంధ్రప్రదేశ్‌లో తీవ్ర సంచలనం సృష్టించిన కలుపుమొక్క పేరు? (హైయాసింత్ – గుర్రపుడెక్క)

686. ఎస్.ఆర్.వై. అంటే ఏమిటి? (సెక్స్ డిటర్మినింగ్ రీజియన్ – పురుష వీర్యకణంలో 'వై' క్రోమోజోమ్‌పై లింగ నిర్ధారణ జీన్ ఉండే ప్రాంతం)

687. ప్రాజెక్టు టైగర్ అంటే ఏమిటి? (భారతదేశంలో పులుల సంరక్షణకై 1973 ఏప్రిల్ 1న ప్రారంభించిన పథకం)

688. యుథనేసియా అనగా నేమి? (మెర్సీ కిల్లింగ్)

689. వినాళ గ్రంథులలో పెద్ద గ్రంథి ఏది? (ఎడ్రినల్ గ్రంథి – ఇది మూత్రపిండాలపై టోపీలవలె ఉంటుంది)

690. ఐ.వి.ఎఫ్. అనగానేమి? (ఇన్‌విట్రో ఫెర్టిలైజేషన్ – తల్లి గర్భాశయం వెలుపల పిండం ఏర్పడుట)

691. ASCII అంటే ఏమిటి? (కంప్యూటర్‌లో అమెరికన్ స్టాండర్డ్ కోడ్ ఫర్ ఇన్ఫర్మేషన్ ఇంటర్ చేంజ్)

692. టెస్ట్‌ట్యూబ్ బేబీ ప్రక్రియని విజయవంతం చేసినదెవరు? (డాక్టర్ పాట్రిక్ స్టెప్టో, రాబర్ట్ విలియమ్స్)

693. BHEL డిజైన్ చేసిన ట్రైనింగ్ ఎయిర్ క్రాఫ్ట్ పేరు? (రేవతి)

694. న్యూయార్క్‌లోని పాపులేషన్ కౌన్సిల్ శాస్త్రజ్ఞులు రూపొందించిన గర్భనిరోధక సాధనం? (నార్ ప్లాంట్)

695. స్త్రీలకు ప్రత్యేకంగా తయారుచేసిన అంతర్జాతీయ ప్రమాణాలు గల తక్కువ మోతాదు గర్భనిరోధక మాత్ర పేరేమిటి? (పెరల్)

696. క్రయో సర్జరీ అంటే ఏమిటి? (అతిశీతలీకరణ పద్ధతిద్వారా రోగగ్రస్తకణాలను నాశనం చేసే వైద్య ప్రక్రియ)

697. మనిషి శరీరంలో 'ఎండోథీలియమ్' అంటే ఏమిటి? (శరీరంలోని రక్తనాళాలు, లింఫ్ నాళాలలోని ఖాళీలకు పైన వుండే పొరను ఎండోథీలియమ్ అంటారు)

698. సీతాకోక చిలుక విడుదలచేసే విషం పేరు? (కార్డినోలైడ్)

699. 'కామిని' రియాక్టర్ ఎక్కడ ఉంది? (కల్పకం వద్ద)

700. ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సుగర్ టెక్నాలజీ ఎక్కడ ఉంది? (కాన్పూర్‌లో)

701. తల్లిగర్భం నుంచి పిండాన్ని బయటికి నెట్టే సంకేతాలు గల హార్మోన్ పేరు? (ఆక్సిటాసిన్)

702. శరీరంలో వయసుని పెంచే గ్రంథి ఏది? (పిట్యూటరీ)

703. ప్రోజెరియా అంటే? (ఏజీయింగ్ డిసీజ్ – చిన్నతనంలోనే వృద్ధాప్యం)

704. ఎఫ్.ఎస్.హెచ్. అనగా? (ఫాలికల్ స్టిమ్యులేటింగ్ హార్మోన్)

705. గ్రోత్ హార్మోన్‌ని స్రవించే గ్రంథి ఏది? (పిట్యూటరీ)

706 థైరాయిడ్ గ్రంథికి అవసరం అయిన రసాయనం (అయోడిన్)

707 'థైరాయిడ్ పిల్స్' అంటే ఏమిటి? (థైరాయిడ్ కేన్సర్ చికిత్సకి వాడే మాత్రలు)

708. 'థ్రోన్ ఆఫ్ ఇమ్యూనిటీ' అని దేనికి పేరు? (థైమస్‌గ్రంథి)

709. శరీరంలో చీముపట్టడానికి కారణం ఏమిటి? (స్టాఫైలో కాకస్ జీవులు)

710. శరీరంలో చనిపోయిన బాక్టీరియా వ్యర్థ పదార్థాలని జీర్ణంచేసే కణాలు ఏవి? (ఫాగోసైట్ కణాలు)

711. థైమోసిన్ పని ఏమిటి?
(శరీరంలోని రోగ నిరోధకశక్తిని చైతన్యవంతం చేయడం)

712. కార్టిజోన్ రసాయనాలు ఎక్కడ పుడతాయి? (ఎడ్రినల్ హార్మోన్‌లు)

713. ఆవేశం, దుఃఖం, కోపం. ఉద్రేకం వంటివి కలిగినప్పుడు ఏ హార్మోన్‌లు ఎక్కువగా స్రవిస్తాయి? (ఎడ్రినల్ హార్మోన్‌లు)

714. బొమెన్స్‌కాప్సూల్ ఎక్కడ వుంది? (మూత్రపిండాలలో ఒక భాగంగా)

715. "ఎక్స్-ఎక్స్" క్రోమోజోములు కలిస్తే? (ఆడపిల్ల పుడుతుంది)

7:6 "ఎక్స్-వై" క్రోమోజోములు కలిస్తే? (మగపిల్లవాడు పుడతాడు)

717. మగపిల్లవాడే పుట్టడానికి ఉపయోగించే పద్ధతి? (ఎరిక్‌సన్ పద్ధతి)

718. బాలికలలో యుక్తవయసును తీసుకువచ్చే హార్మోన్‌పేరు (ఈస్ట్రోజన్)

719. గర్భంలో పిండం అడ్డం తిరగడాన్ని ఏమంటారు? (బ్రీచ్‌పొజిషన్)

720. డయాలసిస్ అనగా ఏమి?
(కృత్రిమ మూత్రపిండాల యంత్రం ద్వారా రక్తాన్ని శుద్ధిచేసే ప్రక్రియ)

721. వేసక్టమీ అంటే ఏమిటి? (పురుషుల వీర్యకణాలని ప్రవహింపజేసే వీర్యనాళిక (వేస్‌డిఫరెన్స్)ని కత్తిరించి చేసే ఆపరేషన్)

722. ట్యూబెక్టమీ అంటే ఏమిటి? (స్త్రీల అండవాహికల (ఫిపాలోపియన్ ట్యూబ్యూల్స్)ని కత్తిరించి చేసే శస్త్ర చికిత్స)

723. సిస్టోస్కోప్ అంటే ఏమిటి? (మూత్రాశయంలోని రాళ్ళను తీసే పరికరం)

724. ఊపిరితిత్తుల తర్వాత "కేన్సర్" ఎక్కువగా వచ్చే అవయవం ఏది? (ప్రోస్టేట్ గ్లాండ్)

725. ఆస్టియోపోరసిస్ ఏ అవయవానికి వచ్చే వ్యాధి?
(ఎ[illegible] [illegible]కి వచ్చే [illegible])

726. జుట్టు ఎందుకు నెరుస్తుంది?

(రోమగ్రంథులలోని పిగ్మెంట్ రసాయనం తగ్గడం వల్ల)

727. మనిషి శరీరాన్ని బ్యాలన్స్ చేసే అమరిక ఎక్కడ వుంది?
(చెవిలోపల వున్న మూడు సెమి సర్క్యులర్ కెనాల్స్ శరీరాన్ని బ్యాలన్స్ చేస్తుంటాయి. ఒక కెనాల్ ఎత్తువల్లాల తేడాని గ్రహిస్తుంది. రెండవ కెనాల్ ముందుకు నడిచే కదలికను కంట్రోల్ చేస్తుంది. మూడవ కెనాల్ అటుయిటు కదలికకి సహకరిస్తుంది)

728. మనిషి చెవి వినగలిగిన ధ్వని పరిమితి? (60–70 డెసిబుల్స్)

729. 'క్లోనింగ్' అంటే ఏమిటి?
(బీజకణాలు అవసరం లేకుండా సాధారణ జీవకణం నుంచి జీవి (మనిషి)ని పెంచడం)

730. మొట్టమొదటి మూత్రపిండాల మార్పిడి చికిత్సచేసిన శాస్త్రవేత్త?

(ముర్రే)

731. థామస్ ఘనత ఏమిటి?
(ఎముకమజ్జ (Bone - Marrow) మార్పిడి చేసిన తొలి శాస్త్రవేత్త)

732. ఓజోన్‌పొర ఉపయోగం ఏమిటి?

(సూర్యకాంతిలోని అతినీలలోహిత కిరణాల నుంచి మనిషిని కాపాడుతుంది)

733. గబ్బిలాలు చీకటిలో కూడా ప్రమాదం లేకుండా ఎలా ఎగురగలుగుతున్నాయి? (గబ్బిలాలు అల్ట్రాసోనిక్ ధ్వని తరంగాల్ని ప్రసరించి, సురక్షితంగా ఎగురుతాయి)

734. మనిషి దూరపు వస్తువుల్ని, దగ్గిర వస్తువుల్ని ఎందుచేత చూడగలుగుతాడు? (కంటిలోని కటకం తన నాభ్యంతరాన్ని మార్చుకొనగలదు కనుక)

735. ఇనుపమేకు పాదరసంపై తేలుతుంది. నీటిలో మునుగుతుంది. ఎందుచేత?

(పాదరసంకన్నా ఇనుము సాంద్రత తక్కువ)

736. పెడాలజీ అనగా నేమి? (భూమి రకాల గురించి పరిశీలించే శాస్త్రం)

737. రెండు బిందువుల వద్ద ఒత్తిడి తేడాని ఎలా కొలుస్తారు?

(మోనోమీటర్‌తో)

738. హిస్టాలజీ అనగా ఏమిటి? (జీవకణాల అధ్యయనం)

739. హైకోర్టు కలిగి ఉన్న కేంద్రపాలిత ప్రాంతం? (ఢిల్లీ)

740. ప్రపంచ పృథ్వీ దినోత్సవం ఎప్పుడు పాటించారు?
(1990, ఏప్రిల్ 22న)

741. శ్వేత విప్లవం అంటే? (పాల ఉత్పత్తిని అధికం చేయడం)

742. మైక్రో కంప్యూటర్‌లో వర్డ్‌లెంగ్త్ ఎంత? (4నుంచి 32 కారక్టర్లు)

743 కంప్యూటర్ సెంట్రల్ ప్రోసెసింగ్ యూనిట్ వేగం ఎంత?
(4 నుంచి 28 మెగాహెర్ట్జ్)

744. పర్వతాలపై వంట చేయడం ఎందుకు ఆలస్యమవుతుంది?
(తక్కువ పీడనం వల్ల)

745. 'DYSLEXIA' అనగా నేమి? (చదవడం, పలకడంలో లోపం)

746. దాల్చినచెక్క మొక్కలో సుగంధద్రవ్యంగా వాడే భాగం ఏది?
(బెరడు)

747. విద్యుత్ ప్రవహించే తీగలకి ఫ్యూజులు ఎలా అమర్చబడి వుంటాయి?
(సమాంతరంగా)

748. పొగాకు మొక్కపై పెరిగే కలుపు మొక్క ఏది?
(పొగాకుమల్లి–ఓరబాంకి)

749. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రపు విహంగం (పక్షి) ఏది? (పాలపిట్ట)

750. విశ్వవిస్తరణ (EXPANSION OF THE UNIVERSE) సిద్ధాంతం చెప్పిన వారెవరు? (హబుల్)

751. సౌరవ్యవస్థని దాటి వెళ్ళిన కృత్రిమ ఉపగ్రహం ఏమిటి?
(వాయేజర్–2)

752. ఆయిల్ ఆఫ్ విట్రియల్ అని దేన్ని అంటారు? (సల్ఫ్యూరిక్ అమ్లము)

753. సి.ఎస్.ఎఫ్. (C.S.F.) అనగా ఏమిటి? (సెరిబ్రో స్పైనల్ ఫ్లూయిడ్)

754. వెజిటేరియన్ గ్రుడ్డు అంటే ఏమిటి?
(ఫలదీకరణ (FERTILISATION) జరగని గ్రుడ్డు. దీని నుంచి పిల్ల పుట్టదు)

755. కేన్ షుగర్ రసాయన నామం ఏది? (సుక్రోజ్)

756. ఫ్రూట్ షుగర్ అని దేనిని పిలుస్తారు? (ఫ్రక్టోజ్)

757. సూర్యుడికీ భూమికీ మధ్య దూరం ఎంత?
(తొమ్మిదికోట్ల ఇరవై ఎనిమిది లక్షల మైళ్ళు)

758. 'పెట్రోలు మొక్కలు' అంటే ఏమిటి?
(ఆయిల్‌ని తయారుచేయడానికి ఉపయోగించే రబ్బరు మొదలైన జాతుల మొక్కలు)

759. రెడ్ ఐడర్ అనగా (ఆయిల్‌బావుల అగ్నిప్రమాదాలను అరికట్టగల నిపుణుడు)

760. భరత్‌పూర్ అభయారణ్యం దేనికి ప్రసిద్ధి? (పక్షుల సంరక్షణ కేంద్రం)

761. కఠిన జలం (HARD WATER) లో ఏ రసాయనాలు ఎక్కువగా ఉంటాయి? (మెగ్నీషియం, కాల్షియం)

762. ఎలక్ట్రిక్ కరెంట్ అంటే ఏమిటి?
(ఒక యూనిట్ టైమ్‌లో విద్యుద్వాహకంలో ఏ దిక్కుకైనా సరే ప్రవహించే విద్యుత్)

763. పి.సి.బి. అనగా? (పొల్యూషన్ కంట్రోల్ బోర్డ్ : హైదరాబాద్)

764. మనదేశంలో పర్యావరణ చట్టం ఎప్పుడు అమలులోనికి వచ్చినది? (1986లో)

765. "సిలికోసిస్" ఎందువలన వస్తుంది? (సిలికాన్ కాలుష్యం వలన)

766. మనిషికి 'మూడవకన్ను' అని దేనికి పేరు? (పైనియల్ గ్రంథికి)

767. మనిషి శరీరంలో 'ఎపెండిసైటిస్' ఏ భాగానికి వస్తుంది? (వెర్మిఫార్మ్ ఎపెండిక్స్)

768. మన రాష్ట్రంలో 'న్యూక్లియర ఫ్యూయల్ కాంప్లెక్స్' ఎక్కడ వుంది? (హైదరాబాద్)

769. 'గ్రీన్‌మాన్' అని ఎవరికి పేరు? (రిచర్డ్ సెయింట్ బెకర్)

770. జీవకణంలో ఆత్మహత్య కణాలు (సూయిసైడ్ సెల్స్) ఏవి? (లైసోజోమ్స్)

771. ఆర్.ఇ.ఎం. అంటే ఏమిటి? (రాపిడ్ ఐ మూవ్‌మెంట్)

772. మనిషి అస్థిపంజరంలోని ఎముకల సంఖ్య ఎంత? (200)

773. మనిషి పుర్రెలో కదిలే ఎముక ఏమిటి? (క్రింది దవుడ ఎముక)

774. మెదడు బరువు ఎంత? 1.4 కిలోగ్రాములు)

775. క్రిమిక (వెర్మిఫారమ్ ఎపెండిక్స్‌కి వచ్చే వ్యాధి పేరేమి? (ఎపెండిసైటిస్)

776. కాలేయంలో ఎన్నిరకాల రసాయన చర్యలు జరుగుతాయి? (500 రకాలు)

777. వృక్ష కణానికి, జంతు కణానికి ప్రధాన తేడా ఏమిటి? (కణకవచం)

778. అనియంత్రిత కండరానికి ఒక ఉదాహరణ ఏది? (గుండె కండరాలు)

779. సిర (వీన్స్)లో రక్తం ఏ రంగులో ఉంటుంది? (నీలం)

780. లారింక్స్‌కు మరో పేరు ఏమిటి? (యాడమ్స్ యాపిల్)

781. హెచ్. ఎస్. టి. అనగానేమి? (హబుల్ స్పేస్ టెలిస్కోప్)

782. యాంటిసెప్టిక్ రసాయనంగా దేనిని వాడతారు? (అయోడిన్)
783. కర్పూరాన్ని గాలిలో ఉంచితే ఏమవుతుంది? (ఉత్పతనం)
784. గ్లౌబర్ లవణం అని దేన్ని అంటారు? (సోడియం సల్ఫేట్)
785. 'ఎమ్నీసియా' అంటే ఏమిటి? (మతిమరుపు)
786. ఎల్. ఎస్. డి. అంటే ఏమిటి? (లెసెర్జిక్ యాసిడ్ డై ఇథైల్ ఎమైడ్)
787. "ద్రవ్యరాశి అంతా స్పందిస్తున్నదని" చెప్పిన శాస్త్రవేత్త ఎవరు? (డాక్టర్ ఎలాన్ సాండజ్)
788. మెదడు సంకేతాలని ఏ రూపంలో పంపిస్తుంది? గ్రహిస్తుంది? (అయస్కాంత స్పందనల ద్వారా)
789. వ్యాధి సోకిన ఆవుపాల ద్వారా వ్యాపించే వ్యాధి ఏది? (రిండర్ పెస్ట్)
790. అగ్గిపుల్లలో మండే పదార్థం పేరు? (భాస్వరం)
791. బ్యాటరీలలో టెర్మినల్స్‌ని దేనితో తయారుచేస్తారు? (జింక్-రాగి)
792. గ్యాసోలిన్‌ని, ఆల్కహాల్‌ని కలిపిన మిశ్రమాన్ని ఏమంటారు? (గ్యాసోహాల్)
793. ఇనుముపై జింక్‌పూత పెట్టే ప్రక్రియని ఏమంటారు? (ఎలక్ట్రోప్లేటింగ్)
794. నదులలో నీటి కాలుష్య పరిమాణాన్ని ఎలా కొలుస్తారు? (కరిగిన ఆక్సిజన్)
795. కలుషితమైన నదీజలాలలో సేంద్రియ పదార్థం ఉనికిని ఏ పరిమాణంతో కొలుస్తారు? (బయొలాజికల్ ఆక్సిజన్ డిమాండ్)
796. డిహైడ్రేషన్‌లో కోల్పోయే పదార్థం? (సోడియం క్లోరైడ్)
797. న్యూక్లియస్‌లోని జీన్‌నుంచి D.N.A. కోడ్ దేనిద్వారా రైబోజోమ్స్‌కి అందుతుంది? (టి.ఆర్.ఎన్.ఎ)
798. నల్లమందులో ప్రధానంగా ఉండేది. (మార్ఫిన్)
799. హేలీ తోకచుక్కపై పరిశోధనకై రష్యా ప్రయోగించిన వ్యోమనౌకల పేర్లేమిటి? (వేగా-1, వేగా-2)
800. వాతావరణంలో ఎక్కువగా వున్న 'రేర్ గ్యాస్' ఏది? (ఆర్గాన్)
801. గురుత్వాకర్షణ శక్తికి లోబడి క్రిందికిపడే వస్తువు వేగం ఎంత? (సెకనుకు 32 అడుగులు)
802. గాజుద్వారా కాంతి వేగం ఎంత? ($3\times10^{8}$)
803. రంగులో వాడే రసాయనం (జింక్ ఆక్సైడ్)
804. చక్కెరను ఫెర్మెంట్ చేయడంవల్ల లభించేది? (ఇథైల్ ఆల్కహాల్)
805. హ్రస్వదృష్టి వున్నవారు వాడే కటకం ఏది? (పుటాకార కటకం)

806. విత్తనాలు మొలకెత్తుటకు కావలసిన ఉష్ణోగ్రత ఎంత?
(35° నుండి 40°C)
807. గుప్తోష్ణానికి ప్రమాణం ఏది? (కెలోరి/గ్రాము)
808. చిలీ సాల్ట్ పీటర్ యొక్క ఖనిజం (సోడియం)
809. అతినీలలోహిత కిరణాలను నిరోధించే గాజు ఏది? (క్రూక్స్ గాజు)
810 ఖనిజాలను సంపదగా పేర్కొన్న భారతీయ తత్త్వవేత్త? (కౌటిల్యుడు)
811. రొట్టెలపై వుండే బూజు సాధారణ నామం? (రైజోపస్)
812. ఆప్టికల్ ఫైబర్‌ను ఎవరు రూపొందించారు?
(డా॥ నరేంద్ర ఎస్. కపనీ – 1855)
813. Ordinary Chalk రసాయన నామం ఏమిటి? (కాల్షియం కార్బొనేట్)
814. సూర్యుడు భూమధ్యరేఖపై నిట్టనిలువుగా వుండే రెండు తేదీలు?
(మార్చి 21, సెప్టెంబరు 22)
815. ఎప్సమ్ లవణం అనగా? (మెగ్నీషియం సల్ఫేట్)
816. భూమిపై మొక్కల వ్యాప్తిని తెలియజేయు శాస్త్రం? (ఫైటోజియాగ్రఫీ)
817. పార్లమెంటు సభ్యుడి ఎన్నిక చెల్లనేరదని ప్రకటించె అధికారం ఎవరికుంది? (సుప్రీం కోర్టు)
818. ఆవరణ వ్యవస్థ అనే పదాన్ని ప్రయోగించిన శాస్త్రవేత్త? (టేన్స్లీ)
819. నాడీ సంధులు లేని జీవి ఏది? (హైడ్రా)
820. గ్రుడ్లను పెట్టే క్షీరదం ఏది? (ప్లాటిపస్)
821. రెక్కలు కలిగిన ఫలం ఏది? (సమార)
822. హెటెరోథాలిజం కనుగొన్న శాస్త్రవేత్త. (బ్లాక్‌స్లీ)
823. సముద్రనక్షత్రపు లార్వా ఏది? (బైపిన్నేరియా)
824. సూర్యునిలో పసుపు రంగులో కనిపించే భాగాన్ని ఏమంటారు?
(ఫోటో స్ఫియర్)
825. అధిక ద్రవ్యరాశి కలిగిన కణం ఏది? (న్యూట్రాన్)
826. న్యూమెస్మటిక్స్ అనగా? (నాణెముల గురించిన శాస్త్రం)
827. బొద్దింకలోని రూపవ్రక్రియను ఏమంటారు? (పౌరామెటబొలి)
828. 'అథ్లెట్ ఫుట్' అనే వ్యాధికి ఏది కారణం? (శిలీంధ్రం)
829. కాంతివేగంతో సమానమైన వేగం కలిగిన కణం ఏది? (గామా కిరణం)
830. ఆల్కహాలు, ఆమ్లాల మధ్య జరిగే చర్య? (ఎస్టరిఫికేషన్)
831. మనదేశంలో హీలియం ఏ రాష్ట్రంలో ఎక్కువగా లభిస్తున్నది?
(పశ్చిమ బెంగాల్)
832. పెడిసిల్లేరియాలు గల జీవి ఏది? (సముద్ర నక్షత్రం)

833. 'హార్స్‌పవర్' అంటే? (బలాన్ని తెలిపే యూనిట్)
834. 'హరిత విప్లవం' అంటే? (ఆహారపదార్థాల ఇతోధిక ఉత్పత్తి)
835. ఎలక్ట్రాన్ సూక్ష్మదర్శినిని కనుగొన్న శాస్త్రవేత్త? (నాల్ అండ్ రాస్కా)
836. మోనోకార్పిక్ అనగా నేమి?
(తన జీవిత కాలంలో ఒకేసారి పుష్పించు మొక్క)
837. జన్యువ్యాధుల నివారణ శాస్త్రం ఏది? (యుఫానిక్స్)
838. దుర్గా అగర్వాల్ ఎవరు? (ప్రపంచంలోని రెండవ టెస్ట్‌ట్యూబ్ బేబీ)
839. పక్షవాత నిర్మూలనకు వాడే కాంతి కిరణాలు? (పరారుణ కిరణాలు)
840. స్వచ్ఛమైన జలం అంటే? (వాన నీరు)
841. కోడిగుడ్డు పై పెంకులో ఉండేది? (కాల్షియం కార్బనేట్)
842. మొదటి ప్రపంచ యుద్ధంలో రసాయనిక ఆయుధంగా దేన్ని ఉపయోగించారు? (మస్టర్డ్ గ్యాస్)
843. కాస్టిక్ సోడా రసాయన నామం? (సోడియం హైడ్రాక్సైడ్)
844. ద్రవాల సాంద్రతను కొలుచుటకు ఉపయోగించు సాధనం?
(హైడ్రోమీటరు)
845. కిమోగ్రాఫ్ అనగానేమి? (శ్వాస, రక్తప్రసరణం, మొదలైనవి తెలుసుకోవడానికి ఉపయోగించు సాధనం)
846. వజ్రం మెరయుటకు గల కారణం? (టోటల్ ఇంటర్నల్ రిఫ్లక్షన్)
847. నీ క్యాప్ (Knee cap) అని దేన్ని అంటారు? (పటెల్లా)
848. గుండె కొట్టుకొనుట దేని ఆధీనంలో ఉంటుంది? (మెడుల్లా అబ్లాంగేటా)
849. 'టేబుల్ సాల్ట్' అనగా? (స్వచ్ఛమైన సామాన్య లవణం)
850. వణుకు పుట్టించే లథిరిజం (Lathyrism) జబ్బుకు గల కారణం?
(కేసరిపప్పు అధికంగా తినడం)
851. భారత్ ప్రయోగించిన తొలి వార్తా ప్రసార ఉపగ్రహం (ఆపిల్)
852. కాలిక్యులేటర్ యాంత్రాన్ని కనుగొన్నదెవరు? (పాస్కల్)
853. పోర్టులాండ్ సిమెంటును కనుగొన్నదెవరు? (హెన్రీ బెటన్.1931)
854. నక్షత్ర చలనం గురించి తెలియజేసినవారెవరు? (కోపర్నికస్.1540)
855. 'గ్రామ్ నెగిటివ్' అనగా? (బాక్టీరియా పేరు)
856. గర్భస్థ పిండాలకు వచ్చే జన్యు వ్యాధులు? (హార్‌నెర్స్ సిండ్రోమ్)
857. 'క్రానిక్ ఫాటిగ్ సిండ్రోమ్' అనగా?
(అలసటతో పాటు ఫ్లూ లక్షణాలు వుండే జబ్బు)

858. స్కిజోఫ్రీనియా అంటే? (మానసిక దుర్మత)

859. క్యాన్సర్ కారక జన్యువుల పేరేమిటి? (ఫార్మా ఫైరాయిడ్ డినోమా)

860. బ్లువిట్రియోల్ రసాయన నామం? (కాపర్ సల్ఫేట్)

861. 'పోలియో' వ్యాధి ఎప్పుడు ఎక్కువగా వ్యాపిస్తుంది? (జూన్-సెప్టెంబరు మాసాల మధ్య)

862. లాంతరు దీపమునకు రంధ్రాలు ఉంచుటకు గల కారణమేమి? (ఉష్ణ సంవాహన ప్రక్రియ జరుగుటకు)

863. మన రాష్ట్రంలో 'జాతీయ కుష్టునిర్మూలనా కార్యక్రమాన్ని' ఎప్పటి నుంచి అమలు చేస్తున్నారు? (1983)

864. జంతువుల నుండి మనిషికి సంక్రమించే వ్యాధులను ఏమంటారు? (జూనోసెస్)

865. పశువుల నుండి మనుషులకు పాలద్వారా ఎక్కువగా సంక్రమించే వ్యాధి ఏది? (బ్రూసెల్లోసిస్)

866. పశువులలో ఏ పరాన్నజీవి వలన 'ముగజంతి వ్యాధి' వస్తుంది? (సిస్టోసోమానాసాలిస్)

867. ఆటలమ్మ రోగి శరీరంపైన ఎర్రచుక్కలు, పొక్కులు, చీముపొక్కులు దశలన్నీ ఒకే రోజున కన్పించడాన్ని ఏమంటారు? (ప్లియోమార్ఫిజం)

868. గనులలో పనిచేసె కార్మికులకు యెక్కువగా వచ్చె వ్యాధి ఏది? (మైనర్స్ ఆస్మా)

869. గ్రామాలలో అంటువ్యాధులు సోకకుండా ముందు జాగ్రత్త చర్యగా వ్యాధి నిరోధక టీకాలు వేయడాన్ని ఏమంటారు? (ఇనాక్యులేషన్)

870. నీటిలో నైట్రేట్లు హెచ్చుగా వుండే వచ్చే వ్యాధి ఏది? (మెథమాగ్లోబినీమియా)

871. సూర్యుని చుట్టూ ఒక ప్రదక్షిణకు భూమికి యెంత కాలం పడుతుంది? (365 రోజులు 5 గంటల 48 నిమిషాల 45.51 సెకన్లు)

872. లేసరును కనుగొన్నదెవరు? (చార్లెస్ హెచ్. టౌన్స్-అమెరికా)

873. ఇన్‌శాట్-1 డి ఏ అంతరిక్ష కేంద్రం నుండి ప్రయోగించబడింది? (ఫ్లోరిడాలోని కెనడీ స్పేస్ సెంటర్)

874. 'Ru-486' అనగా (కొత్త గర్భనిరోధకమాత్ర)

875. మలేరియా క్రిమిని కనుగొన్నదెవరు? (సర్ రోనాల్డ్ రాస్)

876. శిశుకోశ క్షీరదాలు గల జంతువులు ఏవి? (కంగారు)

877. క్రోమోజోములు కనుగొన్నది? (వాల్డియర్)

878. క్షీరదాలలోని వెంట్రుకల గురించి తెల్పు శాస్త్రం ఏది? (ట్రైకాలజీ)
879. గ్లోబ్‌ను తయారు చేసినది? (మార్టిన్ బెహిమ్-1492)
880. ధ్వనిని రికార్డుచేసి, తిరిగి పునరుత్పాదన చేసిన శాస్త్రవేత్త? (థామస్ అల్వా ఎడిసన్)
881. అల్యూమినియం, నికెల్, కోబాల్ట్ మిశ్రమాన్ని ఏమంటారు? (Ai)
882. రేడియోగ్రాఫ్ అనగా— (ఎక్స్-కిరణాల ఫోటోలు)
883. విద్యుత్ షాక్ వల్ల శరీరంలోని ఏ భాగం దెబ్బ తింటుంది? (నాడులు)
884. పొటాషియం సైనేడ్ రుచి పరిక్షిస్తూ ప్రాణాలు పోగొట్టుకున్న శాస్త్రవేత్త? (కార్ల్ విలియమ్ స్కీవ్-స్వీడన్)
885. వివాహ సమయాన్ని కూడా మరచిపోయి ప్రయోగశాలలో పరిశోధనలలో మునిగిపోయిన వ్యక్తి? (లూయీ పాశ్చర్)
886. ఇజ్రాయిల్ ప్రథమాధ్యక్షుడిగా వుండేందుకు నిరాకరించిన శాస్త్రవేత్త (అల్బర్ట్ ఐన్‌స్టీన్)
887. 50,000 HZ తరచుదనం వున్న శబ్దాలను వినగల జంతువు ఏది? (కుక్క)
888. గ్రాఫాలజీ అంటే ఏమిటి? (చేతి వ్రాతను అధ్యయనం చేయుట)
889. జపాన్‌పై ఆటంబాంబు ప్రయోగించిన రోజు ఏది? (1945 ఆగస్ట్ 6)
890. 'మెషీన్ గన్' ను కనుగొన్న శాస్త్రజ్ఞుడు యెవరు? (గాట్లింగ్-1861)
891. ఉత్తర ధృవాన్ని కనుగొన్న తొలి వ్యక్తి? (రాబర్ట్ పియరీ)
892. ఇటీవల కొత్తగా కనుగొన్న తోకచుక్క పేరేమిటి? (ఆగస్టిన్)
893. పత్తిని బేళ్ళుగా మార్చే యంత్రం ఏది? (బ్రామా ప్రెస్)
894. మూత్రపిండాలలో ఏర్పడిన రాళ్ళను ఆవిరిగా మార్చే కిరణాలు? (లేసర్ కిరణాలు)
895. మూత్రపిండాలను అంటి వుండే గ్రంథి ఏది? (అధివృక్క గ్రంథి)
896. మెదడులో వాసనకు సంబంధించిన భాగం? (ఘ్రాణ లంబికలు)
897. కోరింత దగ్గుకు గల కారణం? (కిమోఫిలాస్ పెర్ట్యూసిస్)
898. దేశ, ప్రపంచ పటాలను తయారుచేసే విద్యను ఏమంటారు? (కార్టోగ్రఫీ)
899. విటమిన్ 'సి' ని కనుగొన్నదెవరు? (హాప్‌కిన్స్ హోయిస్ట్)
900. కాంతి పరావర్తన సూత్రాలు ప్రతిపాదించిన శాస్త్రవేత్త ఎవరు? (Snell)

901. వృక్షశాస్త్రంలోని స్టోమ, స్టోమట అనే పారిభాషిక పదాలను వివరించండి?
(స్టోమ అనే పదానికి బహువచనం స్టోమట. చెట్ల ఆకులు శ్వాసక్రియ జరపడానికి అవసరమైన సూక్ష్మ రంధ్రాల గురించి ఈ మాటలు వాడతారు.)

902. రాణి తేనెటీగ జీవితకాలమెంత? ఒకరోజు వ్యవధిలో అది అత్యధికంగా యెన్ని గుడ్లు పెట్టగలదు?
(మూడు నుంచి నాలుగు సంవత్సరాలు. రాణి తేనెటీగ ఒక రోజులో సుమారు 2000 గుడ్లు పెట్టగలదు.)

903. వాతావరణం అత్యధిక స్థాయిలో ఆక్సిజన్‌ను యెక్కడనుండి పొందుతుంది? (సముద్రపు మొక్కల నుండి. వీటినుండి మొత్తం ఆక్సిజన్‌లో 70 శాతం లభిస్తుంది.)

904. Bathyscaphe అంటే ఏమిటి?
(సముద్రగర్భంలో బాగా లోతుగా జరిపే పరిశోధన)

905. అది ఒక పక్షి. మంచు ప్రాంతంలో దాని నివాసం. దానికి యెగరడం రాదు. కానీ యెంతో బాగా ఈత కొట్టగలదు. దాని పేరేమిటి? అది పెట్టే గ్రుడ్లకు బద్ధ శత్రువు యెవరు?
(పెంగ్విన్. ఆర్కిటిక్ మంచు ఖండంలో వుండే స్కువా అనే పక్షి దాని గుడ్లకు బద్ధ శత్రువు.)

906. సజీవ, నిర్జీవ పదార్థాల మధ్యగల తేడా ఏమిటి? (సజీవ పదార్థాలు ఊపిరి పీల్చుతాయి పునరుత్పత్తి చేస్తాయి. నిర్జీవ పదార్థాలకాశక్తి వుండదు.)

907. మనిషి తర్వాత చెప్పుకోతగిన తెలివితేటలు గల జంతువేది? (డాల్ఫిన్)

908. ఒకేసారి తన కళ్ళతో రెండు వేర్వేరు దిశలవైపు చూడగల జంతువేది?
(సముద్ర గుర్రం)

909. జలసంపద సాగరంలో అత్యధికంగా వుంటుంది. భూమిపైగల నీటిలో ఎంత భాగం సాగరంలో వుంది? (సుమారు 97 శాతం)

910. ప్రపంచంలో కెల్లా అత్యంత ఎత్తయిన శిఖరం ఎవరెస్టు. అయితే అత్యంత లోతైన ప్రదేశం ఏది? ఎక్కడ వుంది?

జ. మారియానా కందకంలోని 'ఛాలెంజర్ డీప్'. దీని లోతు 11,022 మీటర్లు. ఇది పసిఫిక్ సముద్రానికి తూర్పునగల మారియానా దీవుల సమీపంలో ఉంది.

911. సముద్ర సర్వే జరిపిన తొలి పరిశోధక నౌక ఏది?

జ. చాలెంజర్. ఈ నౌక సాగర గర్భాలలో భౌతిక, రసాయనిక, భౌగోళిక సర్వేను 1972 డిసెంబరునుండి 1976 మే వరకు జరిపింది. ఇది మొత్తం 1,27,500 మైళ్ల ప్రయాణించింది. 492 ప్రదేశాల్లో సముద్ర లోతుల్ని కొలిచింది. 236 ప్రదేశాల్లో సాగర ఉష్ణోగ్రతల్ని, అక్కడ జలాల్లో లవణ సాంద్రతను కొలిచింది. సముద్ర జలాలలోని 4,717 ప్రాణుల్ని కనుగొన్నది.

912. మన నాటికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూషన్‌ను ఎప్పుడు స్థాపించారు?

జ. నేషనల్ నాటికల్ సైన్సు ఇన్‌స్టిట్యూట్‌ను 1966 జనవరి 1 న స్థాపించారు. దీని ప్రధాన కార్యాలయం గోవాలో ఉంది.

913. మొక్కలు ఎల్లప్పుడూ కాంతి ఉన్న వైపు వంగి వుండటానికి కారణమేమిటి?

జ. మొక్కలలో వుండే ఆక్సిజన్ అనే పదార్థం అవి పెరగడానికి దోహదం చేస్తుంది. కానీ సూర్యకాంతిలో ఆక్సిజన్ తన శక్తిని కోల్పోతుంది. దాంతో చెట్టు లేదా మొక్క మీద కాంతి పడుతున్న భాగం, కాంతి పడని భాగం కన్నా నిదానంగా పెరుగుతుంది. పర్యవసానంగా కొమ్మ కాంతి ఉన్నవైపు వంగుతుంది.

914. గుర్రం ఎత్తును ఎలా కొలుస్తారు?

జ. గుర్రం మెడ, భుజం మధ్యభాగం నుండి కొలుస్తారు. గుర్రం ఎత్తును కొలిచే కొలతను "హ్యాండ్స్ యూనిట్"గా లెక్కిస్తారు.

915. మూలే, డాంకీ, పోనీ అనేవి అశ్వకుటుంబానికి చెందిన జంతువులు. ఈ జాతికి చెందిన మరో జంతువు ఏది?

జ. జీబ్రా

916. హార్స్-పోలో ఎక్కడ పుట్టింది. దాని అసలు పేరేమిటి?

జ. ఇది భారతదేశంలో పుట్టింది. అసలు పేరు 'చౌగన్'

917. అన్నిటికన్నా పెద్దదైన నీటి పాము?

జ. **Annoconda** అనే పాము. ఇది పాములన్నిటికన్నా పెద్దది, పొడవైనది, బలమైనదీ. కానీ ఇది విషంలేని పాము.

918. ఒక పావురాల జంటకు పుట్టిన పావురాలకుటుంబ సంఖ్య ఎంత వుంటుంది? అవి సాధారణ స్థాయిలో పునరుత్పత్తి చేస్తుంటే మూడేళ్ళ కాలంలో వాటిసంఖ్య ఎంత వుంటుంది?

జ. మొదటి సంవత్సరం పూర్తిఅయ్యేనాటికి వాటి సంఖ్య 32కు పెరుగుతుంది. రెండవసంవత్సరం పూర్తయ్యేసరికి 512కు పెరుగుతుంది. మూడో సంవత్సరం పూర్తయ్యేసరికి పావురాల సంఖ్య 8,000 కు చేరుకుంటుంది.

919. మనిషి శరీరంలో అత్యంత పొడవైన, అత్యంత కురచైన ఎముకఏది?

జ. మానవ శరీరంలో అత్యంత పొడవైన, దృఢమైన ఎముక తొడ ఎముక. ఇది ఒక వ్యక్తియొక్క మొత్తం ఎత్తులో 27.5 శాతం వుంటుంది. మనిషి చెవికి వుండే మూడు ఎముకలలో మధ్యన వుండే ఎముక అన్నిటి కన్నా చిన్నది. ఇది 2.6 మిల్లీమీటర్ల నుండి 3.04 మిల్లీమీటర్ల పొడవు వుండొచ్చు. దీని బరువు 2 గ్రాముల నుండి 4.3 గ్రాముల వరకు వుంటుంది.

920. Encephalograph అంటే ఏమిటి?

జ. మెదడు, వెన్నెముకల ఎక్స్-రేలను తీసేందుకు ద్రవపదార్థముండే ఆ అవయవాల్లో గ్యాస్‌ను నింపే ఒక సాంకేతిక విధానం. ఈ విధంగా తీసిన ఎక్స్‌రేలు స్పష్టంగా వుండి అధ్యయనం చేయడం సులువు అవుతుంది.

921. ఎయిడ్స్ అంటే ఏమిటి? అది ఎలా సంక్రమిస్తుంది?

జ. Acquired Immune Deficiency Syndrome అనే పేరుగల వ్యాధికి సంక్షిప్త నామం ఎయిడ్స్(AIDS). ఇది శరీరంలోని రోగనిరోధక శక్తిని నాశనం చేసే వైరస్ వల్ల వచ్చే వ్యాధి. ఈ వ్యాధి వచ్చిన మనిషి అనేకరకాల రోగాలకు తేలికగా లోనవుతాడు. ఎయిడ్స్‌రోగం సోకిన మనిషితో లైంగిక సంబంధం పెట్టుకున్నా, ఆ వ్యాధివున్న వారి రక్తం ఎక్కించినా ఎయిడ్స్ వ్యాధి వస్తుంది. ఇంతవరకు ఈ వ్యాధిని నయం చేయగల మందు కనుగొనబడలేదు.

922. Bacillus Calmette Guerin Vaccine ఏ వ్యాధినిరోధానికి వినియోగించుతారు?

జ. క్షయ (Tuberculosis-T.B.) నిరోధించడానికి

923. ఆరోగ్యవంతుడైన మనిషి శరీరంలో ఎంత రక్తం వుంటుంది?

జ. శరీరం మొత్తం బరువులో రక్తం సుమారు 80 శాతం ఉంటుంది.

924 మానవ రక్తంలో నాలుగు రకాలైన గ్రూపులున్నాయి. అందులో ఒక బ్లడ్ గ్రూపు ఏరకం బ్లడ్ గ్రూపునైనా స్వీకరించగలదు. ఆ బ్లడ్‌గ్రూపు ఏది?

జ. రక్తంలో A, B, AB, O అనే నాలుగురకాల గ్రూపులున్నాయి. ఇందులో AB బ్లడ్‌గ్రూప్ ఏ గ్రూపు రక్తాన్నయినా స్వీకరించగలదు.

925. భూ కేంద్ర ఉపగ్రహం (Geostationary Satellite) అంటే ఏమిటి?

జ. భూ కేంద్ర ఉపగ్రహం భూమి తన అక్షంమీద తాను తిరిగే వేగంతో సమానంగా భూమిచుట్టూ తిరుగుతుంటుంది. ఇది భూమికి 35,000 కి.మీ ఎత్తున గుండ్రంగా తిరుగుతుంటుంది. భూమి కోణీయ వేగంతో ఉపగ్రహ కోణీయవేగం సమానంగా వుండటంవల్ల అది ఒకేచోట స్థిరంగా ఉన్నట్లు కనబడుతుంది.

926. భారతదేశ తొలి రాకెట్ ఏది? దానిని ఎక్కడ నుంచి ప్రయోగించారు?

జ. రోహిణి–75. దీనిని 1967 నవంబరు 20న తుంబా కేంద్రం నుండి భూమి పరిశీలన నిమిత్తం ప్రయోగించారు. మనదేశ శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణుల బృందమే రూపొందించి ప్రయోగించిన ఈ ఉపగ్రహ వ్యాసం 75 మిల్లీమీటర్లు.

927. ఒకపౌను తేనె సేకరించడానికి ఒక తేనెటీగ తేనెపట్టుకు, పువ్వులకు మధ్య సంచరించె దూరం ఎంత?

జ, 3x39 841 కిలోమీటర్లు. ఈ దూరం భూమిచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణాలు చేసిన దానికి సమానం.

928. సైబీరియా తదితర పక్షులు శీతలప్రాంతాల నుండి వెచ్చని వాతావరణం వుండే ప్రాంతాలకు వలస వెళతాయి. ఎందుకని?

జ. అవి ఆహారాన్ని వెదుక్కుంటూ వలస వెళతాయి. శీతల ప్రాంతాల్లో శీతాకాలంలో వాటికి కావలసిన ఆహారం లభించదు.

929. పత్థర్‌కాపూర్ అనేది ఏ వృక్షజాతి?

జ. లిచెన్. ఈ చిన్న మొక్క ఆల్గే, ఫంగి వంటి కోవకు చెందినది.

930. శ్రీహరికోట అంటే ఏమిటి? అది దేనికి ప్రసిద్ధి చెందినది?

జ. శ్రీహరికోట 13,000 హెక్టార్ల విస్తీర్ణంగల చిన్నదీవి. ఇది మద్రాసు నగరానికి 100 కి.మీ. దూరంలో వుంది. ఆంధ్రప్రదేశ్‌లోని ఈ శ్రీహరికోట అంతరిక్ష కేంద్రం నుండే రోహిణి, SLV లను ప్రయోగించారు.

931. OTEC అంటే ఏమిటి?

జ. Ocean Thermal Energy Conversion (సాగరజలాలశక్తి రూపాంతరీకరణ) అనే దానికి OTEC పొడిమాటగా సంక్షిప్త రూపం. ఈ పద్ధతి ద్వారా సాగరజలాల్లో వుండే వేర్వేరు ఉష్ణోగ్రతల నుండి

విద్యుత్తును ఉత్పత్తి చేస్తారు. ఇందుకోసం 1920 నుండి ఫ్రాన్స్, అమెరికా తదితర దేశాలు కృషి చేస్తున్నాయి. కానీ ఇంతవరకూ ఈ పథకం పెద్దగా విజయవంతం కాలేదు. మన భారతదేశ శాస్త్రజ్ఞులు కూడా లక్షద్వీప్ దీవివద్ద గల ఓటెక్ విద్యుత్ కేంద్రం వద్ద ఈ రంగంలో పరిశోధనలు చేస్తున్నారు.

932. భారతదేశపు తొలి జలవిద్యుత్ ప్రాజెక్టు ఏది?

జ. భారతదేశంలో 1897లో డార్జిలింగ్ వద్దగల చిన్న నదిమీద తొలి జలవిద్యుత్ ప్రాజెక్టును నిర్మించారు. అయితే 1902 లో శివసముద్రం విద్యుత్ కేంద్రాన్ని భారీస్థాయిలో నిర్మించారు. ఇది 4,500 కిలోవాట్ల విద్యుదుత్పాదన చేయగలదు.

933. 'PURNIMA' అంటే ఏమిటి? అది ఏం చేస్తుంది?

జ. Plutonium Reactor for Neutronic Investingations in Multiplying Assemblies అనే దానికి PURNIMA సంక్షిప్త పదం. న్యూట్రాన్లను అధ్యయనం చేసేందుకు ఈ రియాక్టర్‌ను బాబా ఆటమిక్ రీసెర్చ్ కేంద్రంలో తయారు చేశారు.

934. వేడినీటి ఊటలనుండి విద్యుదుత్పాదనకోసం తొలి ప్రయత్నాలు ఎప్పుడు, ఎక్కడ జరిగాయి?

జ. ఈ ప్రయత్నాన్ని ఇటలీలో ఆ దేశ శాస్త్రజ్ఞుడు క్రేంట్‌పియర్రి 1904లో ప్రారంభించి విజయవంతం చేశాడు. ఒక వేడినీటి ఊటనుండి అయిదు బల్బులు వెలగడానికి తగినంత విద్యుత్తును ఉత్పత్తి చేశారు.

935. అశ్వశక్తి (Horse Power) అంటే ఏమిటి? ఆ పేరును ఎవరు, ఎందుకు పెట్టారు?

జ. శక్తిని కొలవడానికి 'హార్స్‌పవర్'ను ఒక యూనిట్‌గా లెక్కిస్తారు. 550 ఫాలిపౌండ్ల శక్తికి సమానమైన బలాన్ని ఒక అశ్వశక్తి యూనిట్‌గా లెక్కిస్తారు. ఇది ఏడువందలవాట్ల శక్తికి సమానం. 18వ శతాబ్దిలో జేమ్స్‌వాట్ ఈ పేరుపెట్టాడు. ఆ రోజుల్లో గుర్రాన్ని శక్తికి సంకేతంగా భావించుతున్న కారణంగా ఆ పేరు పెట్టాడు. ఒక నిమిషం వ్యవధిలో బలమైన గుర్రం 32,400 ఫాలి-పౌండ్ల పనిచేయగలదని జేమ్స్‌వాట్ లెక్కించారు. తదనంతర కాలంలో జేమ్స్‌వాట్‌కు సహచరుడిగా పనిచేసిన బోల్టన్ అశ్వశక్తిని 33,000 ఫాలి-పౌండ్లుగా లెక్కించారు.

936. Mach Number అంటే ఏమిటి?

జ. ఒకే విధమైన పరిస్థితులలో ఒక వస్తువు యొక్క వేగానికి, శబ్ద వేగానికి మధ్య గల నిష్పత్తి.

937. Calendering అంటే ఏమిటి?
(కాయితం, లేదా వస్త్రం నున్నగా అయ్యేలా చేయడానికి రెండు రోలర్ల మధ్య పెట్టి గట్టి ఒత్తిడి కలిగించే ఒక రకమైన ప్రక్రియ. కాయితం, వస్త్రాల పరిశ్రమలో ఈ పద్ధతి వినియోగిస్తారు.)

938. మొట్టమొదటి ఆవిరినౌకను ఎవరు కనుగొన్నారు?
(1787లో జాన్‌ఫిచ్)

939. భోపాల్ గ్యాస్ ప్రమాదానికి కారణమైన గ్యాస్ పేరేమిటి? మృత్యు కారణమైన మరో గ్యాస్ కూడా వుంది. దానిపేరేమిటి?
(మిథైల్ ఐసో సైనేట్ కాని అత్యధికుల ప్రాణాలను బలితీసుకున్న గ్యాస్ షాస్‌జీన్)

940. Photo Voltas Cell అంటే ఏమిటి? అదెలా పనిచేస్తుంది?
(కాంతిశక్తితో విద్యుత్తు ఏర్పడేలా చేసే సాంకేతిక విధానం. దీనిలో సిలికాన్ జెర్మానియం మొదలైన సెమీ కండక్టర్లు వుంటాయి. ఈ మూలకాలు కాంతిశక్తిని (light energy) స్వీకరించి, విద్యుత్ ఏర్పడేలా చేస్తాయి.)

941. వర్తమానకాలంలో సూపర్ కండక్టర్‌గా వినియోగపడుతున్నవి ఏవి?
(మిట్రెయం, బేరియం, జీవియం మరియు ఆక్సిజన్‌ల మిశ్రమం)

942. వర్షం వచ్చే ముందు మనకు చెమట పట్టడానికి కారణం ఏమిటి?
(వర్షం వచ్చే ముందు గాలి ఆవిరితో నిండిపోతుంది. పర్యవసానంగా చెమట ఆరిపోదు.)

943. తడిచినప్పుడు రంగు దుస్తులవన్నె మరింత గాఢంగా కనిపించడానికి కారణం ఏమిటి?
(తడవగానే వస్త్రంలోని దారాల మధ్య గల సూక్ష్మ రంధ్రాలు నీటి చుక్కలతో నిండిపోతాయి. ఆ నీటికణాల నుండి కాంతి ప్రతిబింబించడం వల్ల రంగు మరింత గాఢమైన వన్నె సంతరించుకుని కనపడుతుంది.)

944. ట్రాన్సిస్టర్ అంటే ఏమిటి? దానినెవరు కనుగొన్నారు?
(ట్రాన్సిస్టర్ అంటే ఘనరూపంలో వున్న చిన్న సెమీకండక్టర్‌కు (సాధారణంగా ఇది జెర్మానియం, లేక సిలికాన్) తగినచోట్ల మూడు వైర్లను కలిపిన ఒక ఎలక్ట్రానిక్ పరికరం. ఈ మూడు ప్రదేశాలు

థెర్మానిక్ వాల్వ్ యొక్క కాథోడ్, యానోడ్, మరియు గ్రిడ్‌లను పోలి వుంటాయి. ట్రాన్సిస్టర్‌లు కుదిమట్టంగా, చిన్నవిగా వుంటాయి. పొదుపైనవి కూడా. ఈ పరికరాన్ని 1948లో బర్డీన్, బ్రాట్టయిన్, షాక్లీ కనుగొన్నారు.)

**945.** చంద్రమండలం మీద దిగిన మొట్టమొదటి రాకెట్ ఏది?
('లూనా-11' అనే రష్యన్ల రాకెట్టు. 1959 సెప్టెంబరు 12న చంద్ర మండలంపై దిగింది.)

**946.** వాతావరణ ఉపగ్రహం అంటే ఏమిటి? అటువంటి ఉపగ్రహాల్లో మొట్ట మొదటి దాని పేరేమి?
(భూమి చుట్టూ తిరుగుతూ వాతావరణ నివేదికలను పంపే మానవ నిర్మిత ఉపగ్రహం. కొన్ని ఉపగ్రహాలు వాతావరణ నివేదికలను పంపడంతో పాటు: టెలి కమ్యూనికేషన్స్ రంగంలో కూడా ఉపయోగపడుతున్నాయి. ఇటువంటి తొలి వాతావరణ ఉపగ్రహాన్ని మొట్టమొదట అమెరికా తయారు చేసింది. దానిపేరు "వాన్‌గార్డ్ ii." కానీ ఇది పెద్దగా విజయవంతంకాలేదు. విజయవంతంగా ప్రయోగించబడిన ఉపగ్రహం 1960లో తయారైన 'టిరోస్ i.)'

**947.** Insat I/B ఏ తరహాకు చెందిన ఉపగ్రహం? దాన్ని ఎవరు రూపొం దించారు? ఎలా ప్రయోగించారు?
(భారతదేశ అంతరిక్ష కార్యక్రమం క్రింద ప్రయోగించబడిన ఉపగ్రహం ఇన్సాట్. దీనిని 1983లో అమెరికన్ స్పేస్‌షటిల్ 'ఛాలెంజర్' ద్వారా అంతరిక్షంలోకి ప్రయోగించారు. అది 1983 అక్టోబర్ 15 నుండి పనిచేయడం ప్రారంభించింది. ఇది టెలివిజన్ చిత్రాల 'బీమ్'లను ప్రసారం చేస్తుంది. వాతావరణ నివేదికలు పంపుతుంది. టెలికమ్యూని కేషన్స్‌కు కూడా ఉపయోగపడుతుంది.)

**948.** కమ్యూనికేషన్స్ ఉపగ్రహం అంటే ఏమిటి? మొట్టమొదట ఇలాంటి ఉపగ్రహాన్ని నిర్మించింది ఎవరు?
(కమ్యూనికేషన్స్ ఉపగ్రహాలు అత్యంత దూరప్రాంతాలలోని టెలిఫోన్, టెలివిజన్ మరియు రేడియోలతో అనుసంధానం పొందడానికి వీలుగా నిర్మించబడ్డాయి. ఇవి భూమికి 36,000 కి.మీ ఎత్తున భూమి చుట్టూ తిరుగుతుంటాయి. భూమి తన అక్షంమీద తిరిగే వేగంతో సమానంగా ఈ మానవ నిర్మిత ఉపగ్రహాలు కూడా భూమి చుట్టూ తిరుగుతుంటాయి. అందువల్ల ఇవి అంతరిక్షంలో స్థిరంగా వున్నట్లు అనిపిస్తుంది.)

ఇటువంటి పరికరాన్ని మొట్టమొదట ఊహించినవాడు ఆర్థర్ క్లార్క్. క్లార్క్ ఒక సైన్స్ రచయిత.

949. "చంద్రుని మీదకు ప్రయాణం" గురించి ఒక రచయిత వైజ్ఞానిక కాల్పనిక నవల రాశాడు. అతని ఊహ తర్వాత కాలంలో రుజువయింది కూడా. ఆ రచయిత ఎవరు?
(జూల్స్‌వెర్న్. 19 వ శతాబ్దపు వైజ్ఞానిక కాల్పనిక (సైన్స్ ఫిక్షన్) రచయిత. జర్నీ టు మూన్ అనే నవలలో చంద్రుడి వద్దకు వెళ్ళి తిరిగి భూమిని చేరుకోవడాన్ని గురించి ఆయన (1865లో) రాశాడు. ఆయన ఊహ 1969లో మానవుడు చంద్రుడిని చేరుకోవడంతో నిజమయింది.)

950. రాబర్ట్ గొడార్ట్ ఎవరు? దేనివల్ల ఆయన ప్రసిద్ధుడు?
(రాబర్ట్ గొడార్ట్ అంతరిక్ష విజ్ఞాన శాస్త్రవేత్త 1929 లో ఆయన మొట్ట మొదట చంద్రుని దగ్గరకు వెళ్ళడానికి తగిన ఒక రాకెట్‌ను రూపొందించాడు. కానీ విజయవంతం కాలేకపోయాడు. 1941 నాటికే ఆయన V-2 ను పోలిన రాకెట్లకు రూపకల్పన చేశాడు.

951. పలాయన వేగం (Escape Velocity) అంటే ఏమిటి?
(భూమి లేక ఇతర గ్రహాల గురుత్వాకర్షణ శక్తి నుండి బయటపడి, దూరంగా వెళ్ళడానికి అవసరమైనంత వేగాన్ని పలాయన వేగం అంటారు. భూమి గురుత్వాకర్షణ శక్తినుండి తప్పించుకు వెళ్ళడానికి గంటకు కనీసం 40,000 కి. మీ. వేగం అవసరం)

952. ఎటువంటి కిరణాలను కేథోడ్ కిరణాలంటారు?
(ఎలక్ట్రానుల ప్రవాహవేగాన్ని ఇవి ఒక ఎలక్ట్రానిక్ వాల్వు ద్వారా ఎలక్ట్రోడ్ కేథోడ్ చేత విడుదల చేయబడతాయి. కేథోడ్ కిరణాలు అత్యంత వేగంగా ప్రయాణించగలుగుతాయి. కానీ అయస్కాంతాల ప్రభావానికి లోనవుతాయి.)

953. Super Conductivity అంటే ఏమిటి?
(లోహాలను అత్యల్ప ఉష్ణోగ్రత స్థాయికి చేరేలా, అంటే –260 సెల్సి యస్‌కు చల్లబరచినపుడు అవి ఎలక్ట్రికల్ రెసిస్టెన్స్‌ను కోల్పోతాయి. ఇలా కోల్పోవడాన్నే సూపర్ కండక్టివిటీగా పేర్కొంటుంటారు.)

954. నీటి మీద తేలే శిల వుందా?
(ఉంది. అగ్నిపర్వత లావాద్రవం ఘనీభవించగా ఏర్పడిన స్పాంజ్ వంటి శిల (Pumice stone) ).

955. తాను రచించిన గణితశాస్త్ర గ్రంథానికి తన కుమార్తె పేరు పెట్టిన రచయిత ఎవరు?
(రెండవ భాస్కరుడు. ఆయన తన గ్రంథానికి కుమార్తె పేరిట "లీలావతి గణితము" అని నామకరణం చేశాడు.

956. భారతదేశపు తొలి F.R.S., (Fellow of Royal Society) ఎవరు?
(అదేషిర్‌కర్ సేట్‌జీ. ఆయనను 1847 రాయల్ సొసైటీ ఆఫ్ లండన్‌కు ఫెలోగా నామినేట్ చేశారు.)

957. డాక్టర్ మేఘ్‌నాథ్ సాహా ఎవరు? ఆయన ఏ సంస్థతో కలిసి కృషి చేశారు?
(డాక్టర్ మేఘ్‌నాథ్ సాహా ప్రపంచ ప్రసిద్ధ భౌతిక శాస్త్రవేత్త. ఆయన ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూక్లియర్ ఫిజిక్స్ వ్యవస్థాపకులు. సోవియట్ అకాడెమీ ఆఫ్ సైన్సెస్‌లో భారత్‌కు ప్రాతినిధ్యం వహించారు. 1927లో ఆయనను F.R.S గా నామినేట్ చేశారు. 1949 లో ఆయన స్థాపించిన సంస్థకు, ఆయన మరణానంతరం ది సాహా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫిజిక్స్‌గా తిరిగి నామకరణం చేశారు )

958. డాక్టర్ హోమీ భాభా ఎవరు? ఆయన స్థాపించిన సంస్థ ఏది?
(డాక్టర్ హోమీ జహంగీర్ భాభా అసాధారణ ప్రతిభావంతుడైన భౌతిక శాస్త్ర విజ్ఞానవేత్త. ఆయన మీసాను (Meson)ను కనుగొన్నారు. భారత దేశం అణు ఉత్పాదన తొలి దశకు ఆయనే ఆద్యుడు. 1948 ఆగస్టులో అటమిక్ ఎనర్జీ కమిషన్ ఏర్పాటుకు ఆయనే మూలకారకుడు. 1957 లో బొంబాయిలో ది ఆటమిక్ ఎనర్జీ ఇన్‌స్టిట్యూట్‌ను స్థాపించారు. ఈ సంస్థ ఇప్పుడు "డాక్టర్ హోమీ భాభా ఆటమిక్ రిసెర్చ్ సెంటర్"గా పునర్నామకరణం చేయబడి ప్రసిద్ధి పొందింది.)

959. గబ్బిలాలు చీకటిలో ఎలా చూడగలవు?
(అల్ట్రాసోనిక్ తరంగాల ద్వారా. అత్యధిక ఫ్రీక్వెన్సీ గల ఈ శబ్ద తరంగాలు వినబడవు.)

960. ఎగిరే పక్షులన్నిటిలోనూ పెద్దదేది?
(అల్బ్రట్రాస్. దీని రెక్కలు 3.6 మీటర్ల దూరం పరచుకుంటాయి )

961. ఉప్పునీటి చేపలకూ, మంచినీటి చేపలకూ గల తేడా ఏమిటి?
(ఉప్పునీటి చేప నీరు తాగుతుంది. కానీ మంచినీటి చేప నీరు తాగనే తాగదు. ఉప్పునీటి చేప నిరంతరాయంగా నీరు తాగుతూనే వుండాలి.

ఎందుకంటే దాని చుట్టూ ఉండే నీటిలోని లవణాల కంటే దాని శరీరంలో లవణాలు బాగా తక్కువగా ఉంటాయి. ఉప్పునీటి చేపలు తాగే నీరు వాటి నోటి నుండి, చర్మం నుండి బయటకు వస్తుంది. ఈ నష్టాన్ని పూడ్చుకోవడానికి అవి మళ్ళీ మళ్ళీ నీరు తాగుతుండాలి. లేకపోతే అవి బతకలేవు.

మరోపక్క మంచినీటి చేపల శరీరంలో లవణం పదార్థాలు వాటి చుట్టూ ఉండే నీటిలో కంటే ఎక్కువ వుంటాయి. ఒకవేళ అవి గానీ నీరు తాగినట్లయితే, ఆ నీరు వాటి శరీరంలోనే వుండి ప్రమాదం తెచ్చి పెడుతుంది. ఈ కారణం వల్లనే మంచినీటి చేపలు నీరు త్రాగవు. మంచి నీటి చేపలు చర్మం ద్వారా తమ శరీరంలో చేరే కొద్దిపాటి నీటిని మూత్ర విసర్జన ద్వారా వదిలించుకుంటాయి.)

962 Logorithams ను కనిపెట్టినదెవరు?
(స్కాట్లండ్ దేశీయుడైన జాన్‌నేపియర్. వాస్తవానికి అతను మత బోధకుడు. కానీ గణితశాస్త్రం మీద ఆసక్తి గలవాడు.)

963. ఫిబొనాసి సీక్వెన్స్ అంటే ఏమిటి?
(ఫిబొనాసి సీక్వెన్స్‌ను 12వ శతాబ్ది నాటి ఇటలీ దేశీయుడు లియొనార్డో ఫిబొనాసీ కనుగొన్నాడు. అంతకు ముందున్న రెండు అంకెల్ని కూడితే వచ్చే మొత్తం తర్వాతి సంఖ్యగా వుండే అంకెల వ్యవస్థ ఇది. కొంత మంది గణిత శాస్త్రవేత్తలు ఫిబొనాసీ సీక్వెన్స్‌ను '0' (జీరో) తో ప్రారంభిస్తే మరికొందరు 1 తో ప్రారంభిస్తారు. ఉదాహరణకి జీరో తర్వాత 3, తర్వాత 5 వస్తుంది. 3+5=8 అవుతుంది. 5+8=13 అవుతుంది. అంటే ఆ సంఖ్యా పరంపర 0, 3, 5, 8, 13, 21, 34, 55, 89,....ఇలా సాగిపోతుంది.)

964. మహావీర్యాచార్య ఎవరు? ఆయన ప్రసిద్ధ గ్రంథమేది?
(మహావీర్యాచార్య తొమ్మిదో శతాబ్దినాటి గణితశాస్త్రవేత్త. ఆయన జైనుడు. గణితసార సంగ్రహం ఆయన రచించిన ప్రసిద్ధ గ్రంథం.)

965. విఖ్యాత గ్రీకు గణిత శాస్త్రవేత్త యూక్లిడ్ రచించిన విఖ్యాత గ్రంథం పేరేమిటి?
(Elements.)

966. బర్నౌలీ రాజవంశం గణితశాస్త్ర రంగంలో ప్రసిద్ధి పొందడానికి కారణ మేమిటి?

(బెల్జియంలో ఏంటేవెర్ప్ నగరానికి చెందిన బర్నౌలీ రాజవంశం 17, 18 శతాబ్దాలలో ఎనిమిది మంది గణితశాస్త్ర మేధావులకు జన్మనిచ్చింది. వారు జాకొబ్ జాన్ I, డేనియమ్, నికోలస్ I, జాన్ II, జాన్ III, జాకోబ్ II.)

**967.** జనవాసంలేని ఖండమేది?

(అంటార్కిటిక్. అక్కడికి పరిశోధనల నిమిత్తం, ఆవిష్కరణల నిమిత్తం వెళ్ళినవారు మినహా అక్కడ నివసించే ప్రజలెవరూ లేరు.)

**968.** జంతర్‌మంతర్ అంటే ఏమిటి? అది దేనివల్ల ప్రసిద్ధి గాంచింది?

(జంతర్‌మంతర్ అంటే రాజసవాయి జైసింగ్ (రెండవ), జైపూర్ (1686-1743) నిర్మించిన వేధశాలలు (Observatories). ఈ వేధ శాలల్లో ఒకటి ఢిల్లీలోనూ, రెండవది జైపూర్‌లోనూ వుంది.)

జంతర్-మంతర్ వద్ద ఇటుకలు, సున్నం, రాళ్ళతో నిర్మించిన భారీ కట్టడాల సహాయంతో గ్రహాల గురించీ, నక్షత్రాల గురించీ అధ్యయనం చేస్తారు.)

**969.** ఇంతవరకు భూమ్మీద అత్యంత లోతుగా తవ్విన ప్రదేశమేది?

(1985 జనవరి 1న రష్యాలోని జెపోలార్నీలో తవ్వారు. దీనిలోతు 12,500 మీటర్లు.)

**970.** మానవుడు నిర్వహించిన అత్యంత భారీ విస్ఫోటం (ప్రేలుడు) ఎప్పుడు ఎక్కడ జరిగింది?

(పూర్వపు సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్య (U.S.S.R.) లోని నోవ్యాజెన్యాలో 1961 అక్టోబరు 30 న 62 - 90 మెగాటన్నుల అణువిస్ఫోటం జరిగింది.)

**971.** భూమ్మీద గాలి అత్యంత వేగంగా వీచే ప్రదేశం ఏది?

(అంటార్కిటిక్ మంచుఖండం. అక్కడ గాలుల వేగం గంటకు 300 కిలోమీటర్ల కన్నా ఎక్కువే వుంటుంది. (కోస్తా ఆంధ్ర ప్రాంతంలో భయంకరమైన తుఫానులతో వచ్చే ప్రచండమైన గాలుల వేగం 60-80 కి. మీ. మాత్రమే.)

**972.** సుద్ద (Chalk) కూ, సున్నపురాయి (lime stone) కు గల తేడా ఏమిటి?

(సుద్దలో వుండేది కాల్షియం కార్బొనేట్. సున్నపురాయిలో వుండేది కాల్షియం హైడ్రాక్సైడ్.)

973. Amalgum అంటే ఏమిటి?
(ఏ ఇతర లోహంతోనైనా పాదరసం (Mercury) కలిసినప్పుడు అది Amalgum అవుతుంది.)

974. కార్బోహైడ్రేట్‌లో గల పదార్థాలేమిటి?
(కార్బన్, హైడ్రోజన్, ఆక్సిజన్.)

975. Dilute Accetic Acid ని సాధారణంగా ఏ పేరుతో పిలుస్తారు?
(వినెగర్)

976. కారు ఉప్పునీరు అంటే ఏమిటి?
(ఘనీభవించిన ఉప్పునీరు. Brine)

977. ఐసు ఏ ద్రవంలో కరగకుండా వుంటుంది?
(అమోనియా ద్రవంలో)

978. కోడిగుడ్డు సొనలో మునిగిన వెండి చెంచాభాగం ఎందుకని నల్లబడుతుంది?
(కోడిగుడ్డు సొనలో వుండే గంధక (Sulphur) పదార్థానికి వెండి (Silver) తో సంబంధం ఏర్పడగానే ఉత్పత్తి అయ్యే సిల్వర్ సల్ఫేట్ వల్ల వెండి చెంచా రంగు మారిపోతుంది.

979. సాధారణ ఉష్ణోగ్రత వద్ద కరిగే లోహం ఏది?
(పాదరసం)

980. హెలికాప్టర్ ఎవరు కనిపెట్టారు?
(1939 లో ఇగోర్ సికొర్‌స్కీ)

981. లడఖ్‌వంటి శీతల ప్రాంతాలలో సూర్యుడు కాంతివంతంగా ప్రకాశిస్తున్నప్పటికీ అక్కడ నీడవున్న ప్రాంతాలలో ఆ ప్రభావం ఏమీ లేకుండా చల్లగానే వుంటుంది. ఎందువల్ల?
(లడఖ్ వంటి శీతల ప్రదేశాల వాతావరణంలో సాంద్రత వుండదు. ఫలితంగా సూర్య కిరణాలు నిరాటంకంగా భూమిని చేరుకుంటాయి. సూర్యుడు కాంతివంతంగా వుంటాడు. సూర్యకాంతి వేడిగా తీక్షణంగానే వుంటుంది. కానీ వాతావరణంలో సాంద్రత లేనంత వరకూ సూర్యకాంతిలోని వేడిని వాతావరణం స్వీకరించలేనందువల్ల నీడగావున్న ప్రాంతాలు చల్లగానే వుంటాయి.)

982. బాగా వేడిగా మరుగుతూ వున్న నీరు గాజు పాత్రల్లో పోసినప్పుడు అవి చిట్లడానికి కారణం ఏమిటి?
(మరుగుతున్న నీటిని గాజు పాత్రలో పోసినప్పుడు ఆ పాత్ర బాహ్య ఉపరితలం వేడెక్కదు. కానీ పాత్రలోపలి భాగం వెంటనే వేడెక్కి-

వ్యాకోచిస్తుంది. ఈ ఆకస్మిక వ్యాకోచం వల్ల గాజు చిట్లిపోతుంది. (ఇలా జరగకుండా చేయాలంటె ముందుగా గ్లాసులో వెండి చెంచా వేస్తే సరి!)

983. ఎండు రొట్టెలు వంటివి మనం చప్పరించునప్పుడు దౌవలు కదిలిన ప్రతిసారీ కరకరలాడుతున్న చప్పుడు వినిపడుతుంది. కాని మనపక్కనే ఉన్న వ్యక్తికి కూడా వినపడదు. ఎందువల్ల?
(మనం ఏదైనా గట్టి పదార్థం కొరికి తింటున్నప్పుడు కరకరలాడే శబ్దం గాలివల్ల బయటకు ప్రయాణించి పక్కనున్న వారికి వినపడుతుంది. కాని చప్పరించేటప్పుడు శబ్దం మన దంతాల ద్వారా నరాలవల్ల మెదడుకు చేరుతుంది. ఆ శబ్దం మన చెవులకు మాత్రమే కటువైన ధ్వనిలా వినబడుతుంది. అందువల్లనే ఆ శబ్దాన్ని ఇతరులు గమనించలేరు.)

984. ఒక గాయకుడు తన సంగీత ప్రభావంతో గాజు పాత్రను ముక్కలు ముక్కలు చేయగలడా?
(చేయగలడు. గాయకుడు తన సమీపంలో వున్న గాజు పాత్ర పరిమాణానికి తగిన విధంగా శబ్ద ప్రకంపనాల్ని సృష్టించగలిగినట్లయితే, శబ్ద ప్రకంపనాల వైమెన్షన్లు పాత్ర వ్యాకోచాన్ని బహుళంగా పెంచగలిగితే గాజు ముక్కలు ముక్కలు కాగలదు.)

985. క్రోమోజోములంటే ఏమిటి?
(జంతువుల, మొక్కల కణాల గదులలోని ప్రతి న్యూక్లియస్‌లోనూ వుండే నిర్మాణాలను క్రోమోజోములంటారు. వీటి చేతనే జన్యు సమాచారం లభ్యమవుతుంది. వివిధ జాతుల జంతువులు, మొక్కల కణాలలో క్రోమోజోముల సంఖ్య స్థిరంగా వుంటుంది. మనిషి శరీరంలో కూడా క్రోమోజోములు వుంటాయి వాటి సంఖ్య 46.)

986. Mongolism అంటే ఏమిటి?
(క్రోమోజోములలో ఏర్పడే తేడా వల్ల వచ్చే ఒక విధమైన జన్యు సంబంధమైన వ్యాధి. అధిక క్రోమోజోములు (సంఖ్య 21) ఉత్పత్తి అయినందు కారణంగా వచ్చే వ్యాధిని డౌన్‌సిండ్రోమ్ అనీ, '21 ట్రైసమ్ సిండ్రోమ్' అనీ అంటారు.)

987. స్వచ్ఛమైన జలం అంటే?
(వాననీ

988. మొట్టమొదట న్యూక్లియర్ రియాక్టర్‌ను అభివృద్ధి చేసింది ఎవరు? ఎప్పుడు?
(ఎన్రికో ఫెర్మి – 1942 లో)

989. గుండె - ఊపిరితిత్తుల యంత్రాన్ని కనిపెట్టింది ఎవరు? ఎప్పుడు?
(డా॥ జాన్ హెచ్. గిబ్బన్ - 1953 లో.)

990. బంగారం ఎంత ఉష్ణోగ్రత వద్ద కరుగుతుంది?
(1862 F⁰.)

991. రాడార్‌ను కనిపెట్టింది ఎవరు?
(సర్ రాబర్ట్ ఎ. వాట్సన్ - వాట్.)

992. టాకీలు (శబ్దంతో కూడిన సినిమాలు) కనిపెట్టింది ఎవరు? ఎప్పుడు?
(థామస్ ఆల్వా ఎడిసన్ - 1913 లో.)

993. మొట్టమొదటి రిఫ్రిజిరేటర్ ఎవరు తయారుచేశారు?
(1913 లో అమెరికన్ ఇంజనీర్ ఎ. హెచ్. గోస్.)

994. ఎయిర్‌కండిషనింగ్ కనిపెట్టింది ఎవరు?
(1911 లో విల్లీస్ హెచ్. కేరియర్.)

995. తొలి మోటార్ కారును నిర్మించిందెవరు?
(కార్ల్ బెంజ్ అనే జర్మన్ దేశీయుడు 1885 లో కనిపెట్టాడు.)

996. విద్యుత్ పంకా (Electrical Fan) కనిపెట్టిన దెవరు?
(1882 లో షూయ్లర్ ఎస్. వీలర్ (Schuyler S. Wheeler) కనిపెట్టాడు.)

997. బైనాక్యులర్, టెలిస్కోపు మధ్యగల తేడా ఏమిటి?
(దూరంగా వున్న వస్తువుల్ని చూడటానికి రూపొందించిన దృశ్యపరికరం బైనాక్యులర్. ఇందులో ఒక వస్తు కటకం, ఒక నేత్ర కటకం, రెండు మధ్యంతర కటకాలతో వుండి వస్తువును స్పష్టంగా కనపడేలా చేస్తాయి. ఒక కటకం ఆ వస్తువును మన కంటికి దగ్గరగా కనపడేలా చేస్తే, మరొకటి దానిని పెద్దదిగా చేసి చూపిస్తుంది. టెలివిజన్ ప్రసారంలో వస్తువు నుండి వెలువడే కిరణాలు రేడియో తరంగాలుగా మార్చబడి రేడియో ద్వారా ప్రసారం అవుతాయి. ఈ తరంగాలు మళ్ళీ టెలివిజన్ రిసీవర్ ద్వారా ఆ వస్తువు యొక్క కిరణాలుగా మారి ప్రసారమవుతాయి. ఆ విధంగా ప్రసారమయిన దృశ్యాన్ని టెలిస్కోపు ద్వారా చూడవచ్చు.)

998. వేసవిలో కంటే శీతాకాలంలో దూరం నుండి శబ్దాలు మరింత స్పష్టంగా వినబడతాయి. ఎందువల్ల?
(వాతావరణంలోని గాలి అంతా ఒకే సాంద్రతతో వుండటం, శబ్దాన్ని నిరోధించగల సమాన ఉష్ణోగ్రతతో వుండే వాయుతరంగాలు స్వల్పంగా

వుండడంవల్ల. దీనితోపాటు వాయుసాంద్రతకు శబ్దతరంగాలను మరింత స్పష్టంగా ప్రసారం చేయగల గుణం వుంది.)

999. గురుత్వాకర్షణ శక్తి తరంగాలు ఏవి?
(ఇది విశ్వవ్యాప్తమయ్యే గురుత్వాకర్షణ శక్తి క్షేత్రం. ఈ శక్తి పదార్థ పంపిణీ శక్తులవల్ల ఉత్పన్నమవుతుంది. ఈ తరంగాలను సాధారణ సాపేక్ష సిద్ధాంతం సహాయంతో ఊహించవచ్చు. ఈ తరంగాలు కాంతి వేగంతో (సెకనుకు 3,00,000 కి.మీ.) ప్రయాణిస్తూ తమ దారిలో ఎదురయ్యే పదార్థం మీద ప్రచండమైన ఒత్తిడిని కలిగించగలవు. వీటిని గురుత్వాకర్షణశక్తి ధార్మికల అని అంటారు.)

1000. రెడ్‌ఫ్లాగ్ యాక్ట్ అంటే ఏమిటి?
(ఏధుంలో ఆవిరితో నడిచే వాహనాలు పెరుగుతుండటాన్ని పరిగణనలోకి తీసుకుని 1865 లో బ్రిటిష్ ప్రభుత్వం వాహనాల వేగాన్ని నియంత్రించడానికి ఒక చట్టం చేసింది. దాని ప్రకారం ఆవిరితో నడిచే వాహనాల వేగం 4 మైళ్ళకు మించకూడదు. దానితోపాటు రోడ్డుమీద ప్రయాణించే ఆ 'భూతం' గురించి పాదచారులను హెచ్చరించడానికి వాహనానికంటే అరవై అడుగుల ముందు ఒక వ్యక్తి ఎర్రజెండా ఊపుతూ పరుగెత్తాలి. దీనినే 'రెడ్ ఫ్లాగ్ యాక్ట్.' అంటారు.)

1001. సూపర్ కండక్టివిటీ గురించి నేడు భారతదేశంలో పరిశోధనలు చేస్తున్న లేబొరేటరీ పేర్లేమిటి?
(నేషనల్ ఫిజికల్ లేబొరేటరీ, న్యూఢిల్లీ; ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్, బెంగుళూరు; ది టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రిసెర్చ్ బొంబే.)

1002. సెమీ కండక్టర్లు ఏవి? వాటిని ఎందులో ఉపయోగించుతారు?
(ఉష్ణం తక్కువగా వున్నప్పుడు నాన్ కండక్టర్లుగా, ఉష్ణం అధికంగా వున్నప్పుడు కండక్టర్లలాగా పనిచేసేవి. ఇవి కాంతి కిరణాలపట్ల చాలా సున్నితంగా ప్రతిస్పందిస్తాయి. వీటి అణువులకు ఎలక్ట్రాన్లను జత చేయడం ద్వారా గానీ, లేక తొలగించడం ద్వారా గానీ వీటిని నియంత్రించవచ్చు. సెమీ కండక్టర్లు మంచి వాహకాలు (Conductors) కావు. ఎందుకంటే వీటిలో వుండే స్వేచ్ఛా ఎలక్ట్రాన్లు లోహంలోని ఎలక్ట్రానుల కంటే అనేక వేల రెట్లు తక్కువ. జెర్మానియం, సిలికాన్, సెలెనియం, రెడ్ సల్ఫైట్ వంటి వాటిని సెమీ కండక్టర్లు అంటారు. సెమీ కండక్టర్లను ట్రాన్సిస్టర్లలో వినియోగిస్తారు.)

1003. బ్రాడ్‌గేజ్ రైల్వే లైనులోని రెండు పట్టాల మధ్య వుండే దూరమెంత? నారో గేజ్ రైల్వే లైనులోని పట్టాల మధ్య వుండే దూరమెంత?
(బ్రాడ్‌గేజ్‌లో పట్టాల మధ్యదూరం 1.67 మీటర్లు (5.6 అడుగులు). నారోగేజ్‌లో 75 సెంటీమీటర్లు (2.6 అడుగులు.)

1004. డిమెరరా సుగర్ అంటే ఏమిటి?
(సియానాలో చెరకుకు ప్రసిద్ధి పొందిన పట్టణం డిమెరరా. ఆ పట్టణం పేరిట అక్కడ తయారయ్యే ఒక తరహా 'బ్రౌన్ సుగర్'ను డిమెరరా సుగర్ అంటారు.)

1005. చేతి గడియారంలో జువెల్స్ ఎప్పుడూ బేసిసంఖ్యలోనే వుండటానికి కారణం ఏమిటి?
(చేతి గడియారంలోని రెండు చక్రాలకు రెండు జువెల్స్ వుంటాయి. వాటిని తిరిగేలా చేసే రోలింగ్‌పిన్‌కు ఒకే ఒక్క జువెల్ వుంటుంది. అందువల్ల జువెల్స్ సంఖ్య బేసి సంఖ్యలోనే వుంటుంది.)

1006. 'స్టెర్లింగ్ సిల్వర్'కు, 'జర్మన్ సిల్వర్'కు వున్న భేదమేమిటి?
(రెండూ మిశ్రమలోహాలే (Alloys). స్టెర్లింగ్ సిల్వర్‌లో వెండి 92.5 శాతం, రాగి 7.5 శాతం వుంటుంది. జర్మన్ సిల్వర్‌లో రాగి, నికెల్, జింక్‌లు 5:2:2 నిష్పత్తిలో వుంటాయి.)

1007. జోడ్రెల్ బ్యాంక్ ఎక్కడుంది? అది దేనికి ప్రసిద్ధి?
(గ్రేట్ బ్రిటన్‌లో. అక్కడ ఒక భారీ టెలిస్కోప్ వుంది. దాని సహాయంతో అనేక ఖగోళశాస్త్ర పరిశోధనా కార్యక్రమాలు విజయవంతంగా జరిగాయి.)

1008. సూర్యునికి దగ్గరగా వున్న గ్రహమేది?
(ప్రాక్సిమా సెంటారీ. ఇది సూర్యునికి 4.22 కాంతి సంవత్సరాల దూరంలో వుంది. ఇది మసకమసకగా కనబడుతుంది. ఆల్ఫా సెంటారీ ఒక్కటి మాత్రమే మనకంటికి గోచరమయ్యేది. ఇది 4.35 కాంతి సంవత్సరాల దూరంలో వుంది. (కాంతి సంవత్సరం దూరం అంటే ఎంతో తెలుసా? ఈ లెక్కచేసి చూడండి. రోజుకు 86,400 సెకన్లు. సెకనుకు 3,00,000 కి.మీ. వేగంతో సంవత్సరం కాలంలో ఆ కాంతి ప్రయాణించే దూరాన్ని కాంతి సంవత్సరం అంటారు.) ఇంతకన్నా వేగంగా ప్రయాణించగలిగినదేదీ నేటి విజ్ఞాన శాస్త్రానికి తెలీదు.)

1009. ధ్రువ నక్షత్రం ఒకే నక్షత్రమా?
(కాదు. ఎందుచేతనంటే భూమి అక్షం ప్రతి 26,000 సంవత్సరాల

కొకసారి వంపు తిరుగుతున్నందువల్ల, వేర్వేరు నక్షత్రాలు ధ్రువతారలుగా ప్రసిద్ధి పొందాయి. క్రీస్తు జననానికి 3000 సంవత్సరాలక్రితం ఆల్ఫాడ్రా కోనిస్ అనేది ధ్రువనక్షత్రంగా పేరు పొందింది. ఇప్పటి ధ్రువనక్షత్రం పోలారస్-B. క్రీ.శ. 7500లో ఆల్ఫాసెఫారి అనే నక్షత్రం ధ్రువనక్షత్రం అవుతుంది. 14,000 సంవత్సరం నాటికి ఈ స్థానం వేగా అనే నక్షత్రానికి లభిస్తుంది.)

1010. పల్సార్ అంటే ఏమిటి?

(స్థిరంగా ఒకేవిధంగా కాక హెచ్చుతగ్గులతో కాంతిని వెదజల్లే నక్షత్రాలను పల్సార్ నక్షత్రాలు అంటారు. వీటిని 'పల్సేటింగ్ స్టార్స్' అనీ, 'సెఫీడ్' అని కూడా అంటారు. ఇవి కొన్నిసార్లు ఎంతో కాంతివంతంగా ప్రకాశిస్తాయి. కొన్నిసార్లు క్షీణకాంతిని ప్రసరిస్తాయి. అదేవిధంగా ఈ నక్షత్రాలు సంకోచ, వ్యాకోచాలకు కూడా గురి అవుతాయి.)

1011. నక్షత్రమయమైన ఆకాశంలో టెలిస్కోప్ వంటి సాధనాలు ఏమీ లేకుండా కేవలం కళ్ళతో మాత్రమే మనం ఎన్ని నక్షత్రాలు చూడగలం?

(మేఘాలు లేకుండా దూళి, మంచులేని - స్వచ్ఛంగా వున్న రాత్రి వాతావరణంలో మనం 7,000 నక్షత్రాలను చూడగలం. ఇవన్నీ మన పాలపుంతలోని నక్షత్రాలే.)

1012. సూర్యుని తర్వాత కాంతివంతంగా కనిపించే నక్షత్రం ఏది?

(ఆల్ఫాకానిస్ మజారిస్. ఈ నక్షత్రం 8.7 కాంతి సంవత్సరాల దూరంలో వుంది.)

1013. సూర్యకాంతి భూమిని చేరడానికి ఎంత సమయం పడుతుంది?

(499 సెకండ్లు. అంటే 8 నిమిషాల 19 సెకండ్లు.)

1014. ప్లాటిపస్ క్షీరదమే అయిన ఇతర క్షీరదాలకులేని ఒక ప్రత్యేక లక్షణం దానికుంది ఏమిటది?

(ప్లాటిపస్ గుడ్లు పెడుతుంది. కానీ తన పిల్లలకు క్షీరదాల మాదిరిగానే పాలుఇచ్చి పెంచుతుంది.)

1015. ఏకబిగిన సుదీర్ఘకాలం ఎగిరే పక్షి ఏది?

(సూటీటెర్న్ (Sooty Tern) అనే పక్షి ఆగకుండా 3 నుండి 4 సంవత్సరాల వరకు ఎగురగలదు.)

1016. ప్రపంచంలో అన్నిటికన్నా పెద్ద జంతువు ఏది?

(నీలి తిమింగలం. దక్షిణ జార్జియాలో 1904లో పట్టుబడిన ఒక తిమింగలం 33.58 మీటర్ల పొడవు ఉంది.)

1017. ప్రాణికోటిలో అత్యంత శీఘ్రగతిని పెరిగే జంతువు ఏది?
(నీలి తిమింగలం పన్నెండు నెలల వయసు వచ్చే నాటికే దాని బరువు 26 టన్నుల వరకు పెరుగుతుంది.)

1018. సముద్రము నీలంగా కనిపించుటకు కారణమేమి?
(ఆకాశం నుండి వచ్చే కాంతి కిరణాలు నీటిపైబడి విక్షేపణం చెందుట.)

1019. నోబెల్ ప్రైజును ఎప్పుడు నెలకొల్పారు?
(సర్ ఆల్ఫ్రెడ్ నోబెల్ మరణానంతరం ఆయన తొలి వర్ధంతినాడు. 1901 డిసెంబరు 10వ తేదీన తొలి నోబెల్ ప్రైజు బహూకరణ జరిగింది.)

1020. గణితశాస్త్రంలో గ్రాఫ్ విధానం కనిపెట్టిన దెవరు?
(రెని డి కార్టెస్. ఈయన 17వ శతాబ్ది నాటి ఫ్రెంచ్ గణిత శాస్త్రవేత్త.)

1021. ఉత్తర ధ్రువం దాని దిశను ఎందువల్ల మార్చుకుంటుంది?
(ఉత్తరధృవం భూమిమీద కాక ఆర్కిటిక్ సముద్రంలో వుంది. ఆర్కిటిక్ సముద్రం సంవత్సరం అంతా ఘనీభవించే వుంటుంది. ఈ మంచు గడియారం ముల్లు తిరిగే దిశలో గుండ్రంగా తిరుగుతుంటుంది. ఆ కారణంగానే ఉత్తరధృవాన్ని కనుగొనడానికి దిక్సూచిని వాడవలసి వస్తుంది.)

1022. రివాల్వర్‌ను ఎవరు కనిపెట్టారు?
(శామ్యూల్ కోల్ట్ — 1835లో)

1023. హోవర్‌క్రాఫ్ట్‌ను ఎవరు రూపొందించారు?
(క్రిస్టఫర్ సిడ్నీ క్రాకెల్. ఆయన దీనిని 1955 డిసెంబర్ 12న రూపొందించాడు.)

1024. కుట్టుమిషన్‌ను ఎవరు కనుగొన్నారు?
(1790లో దీనిని థామస్ సెయింట్ మొట్టమొదట రూపొందించాడు. కానీ నేటి ఆధునిక రూపంలోని కుట్టుమిషన్‌ను 1867లో తయారు చేశారు.)

1025. మంచినీటితో ఏర్పడని పెద్ద నీటిబుడగలు సబ్బునీటివల్ల ఎందుకని ఏర్పడతాయి?
(నీటికి వుండే పట్టు (టెన్షన్) బుడగలు ఏర్పడగానే వాటిని చిట్లిపోయేలా చేస్తుంది. కానీ సబ్బు, నీటిని జిగురుగాచేసి నీటి బుడగలను అవి ఏర్పడ గానే చిట్లనివ్వకుండా నిరోధిస్తుంది.)

1026. అమెరికా శాస్త్రజ్ఞుడు జాన్‌గ్లెన్ తొలిసారిగా కనిపెట్టిన గ్లెన్ ఎఫెక్ట్ అంటే ఏమిటి?

(గ్లెన్ తాను అంతరిక్షంలో ప్రయాణించేటప్పుడు చీకటి రాత్రిలో సంఖ్యా నేకమైన కాంతివంతంగా వుండే కణాలను గుర్తించాడు. దానినే గ్లెన్ ఎఫెక్ట్ అంటారు. ఈ కాంతి వసుపుదనంతో కూడిన హరిత వర్ణంలో వుంటుంది.)

1027. తొలి మహిళా అంతరిక్ష యాత్రికురాలు ఎవరు?

(వాలెంతినా వ్లాదిమిరోవా తెరిష్కోవా. పూర్వపు సోవియట్ యూనియన్‌కు చెందిన ఈమె 1963 జూన్ 16న వోస్తోక్ – VI లో అంతరిక్ష ప్రయాణాన్ని ప్రారంభించి 1963 జూన్ 19న తిరిగి భూమిమీద దిగింది.)

1028. చంద్రునిమీద మొట్టమొదట అడుగిడిన మానవుడు నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్. రెండవ వ్యక్తి ఎవరు?

(ఎడ్విన్ ఆల్డ్రిన్)

1029. వోస్తోక్ – I అంతరిక్ష నౌకలో ప్రయాణించిన వారెవరు? ఆ ప్రయాణ కాలమెంత?

(కల్నల్ యూరిగగారిన్. పూర్వపు సోవియట్ యూనియన్‌కు చెందిన గగారిన్ 1961 ఏప్రిల్ 12న వోస్తోక్ – Iలో ప్రయాణం ప్రారంభించి భూకక్ష్య చుట్టూ 1 గంట 48 నిమిషాల వ్యవధిలో ఒకసారి ప్రదక్షిణం చేశాడు.)

1030. తొలి భారత అంతరిక్ష యాత్రికుడు రాకేష్‌శర్మ ఏ పేరుగల అంతరిక్ష నౌకలో ప్రయాణించాడు? ఆ అంతరిక్షనౌక మరో అంతరిక్షనౌకతో అనుసంధానించబడింది. దానిపేరు ఏమిటి?

(సోయుజ్ టి–II. అది అంతరిక్షంలో శాల్యూట్–7తో అనుసంధానించబడింది.)

1031. యాంటీమేటర్ అంటే ఏమిటి? అది విశ్వంలో ఎక్కడ వుంటుంది?

(యాంటీమేటర్ అనేది పోసిట్రాన్, యాంటీప్రోటాన్, యాంటీ – న్యూట్రానుల సమ్మేళనం. శాస్త్రవేత్తలు చెపుతున్న దానిని బట్టి అనేక వందల కోట్ల సంవత్సరాలనాడు, ఈ అనంత విశ్వం రూపొందేటప్పుడు మేటర్, యాంటీమేటర్ ఢీకొనడంతో యాంటీమేటర్ అంతరించి పోయింది.)

1032. N.M.R అంటే ఏమిటి?

(న్యూక్లియర్ మాగ్నెటిక్ రిసోనెన్స్)

1033. డెసిబెల్ అంటే ఏమిటి?

(శబ్ద తీవ్రతను లెక్కించే యూనిట్)

1034. సూర్యోదయం కాకముందే ధృవప్రాంతంలో సూర్యుడు కనపడటానికి కారణం ఏమిటి?
(ఎండమావులవల్ల, ధృవప్రాంతంలో అనేకసార్లు కాంతిమీద వేడిగా, గాలిపొరలమీద చల్లగా వున్న బరువుగా వుండే పలుచని గాలిపొర పరచుకుంటుంది. ఈ పరిణామాలు ఒక కటకంలా పనిచేస్తాయి. ఈ కారణంగా సూర్యుడు ఉదయించకముందే ఉదయించినట్లు కనబడతాడు. అది సూర్య ప్రతిబింబం తప్ప మరొకటి కాదు.)

1035. అత్యధిక వక్రీభవన సూచిక గల వర్ణం ఏది?
(ఎరుపు)

1036. చిన్న నీటి కణం గుండ్రంగా ఎందుకుంటుంది?
(ఆ విధంగా అయితే Potential energy తగ్గుతుంది గనుక)

1037. నోబెల్ ప్రైజు పొందిన వారి పేరు తరువాత N.L. అని అక్షరాలు చేరుస్తారు. అవి దేనికి చిహ్నం?
(ఆ వ్యక్తి నోబెల్ లారెట్ అని చెప్పడానికి)

1038. రైలుఇంజిన్‌ను ఎవరు కనుగొన్నారు?
(రిచర్డ్ ట్రెవిథిక్. ఈయన ఒక రాగిగని మేనేజర్ కుమారుడు. రోడ్ లోకోమోటివ్ (వీధిలో నడిచే వాహనాన్ని) రూపొందించి 1801 క్రిస్టమస్‌నాడు జాతీయ రహదారిలో నడిపించాడు. అలా ఆవిరితో నడిచే తొలి వాహనంతో ప్రయాణీకులను చేరవేశాడు. అయినప్పటికీ ఆవిరితో పనిచేసే ఇంజనును 1825లో రూపొందించిన మొదటివాడుగా జార్జి స్టీఫెన్సన్‌నే పేర్కొనాలి.)

1039. నోబెల్ ప్రైజు బహూకరణ జరగని సంవత్సరం ఏది?
(1940లో నోబెల్ ప్రైజు బహూకరణ జరగలేదు. ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభమై స్వీడన్ మీద దాడి జరగడంవల్ల ఈ అవాంతరం ఏర్పడింది. తిరిగి నోబెల్ ప్రైజులు ఇవ్వడం 1943 లో ప్రారంభమైంది.)

1040. ఎలుక జాతులలో ఒకటైన లెమ్మింగ్స్ జాతి ఎలుకలు అకస్మాత్తుగా సముద్రంలోకి వెళ్ళిపోయాయి. ఎందువల్ల?
(ప్రాణుల సంఖ్యను నివారించేందుకు ప్రకృతి అనుసరించే మార్గాలలో ఇది ఒకటి. లెమ్మింగ్స్ జాతి ఎలుక సంఖ్య శీఘ్రగతిని అభివృద్ధి చెందుతుంది. కొద్ది కాలంలోనే వాటి సంఖ్య అపరిమితం అవుతుంది. దాంతో అది తమ నివాసాల్లో వుండలేని పరిస్థితి ఏర్పడి పొలాలు, తోటలు, పండ్ల దుకాణాలు, ఇళ్ళమీద పడతాయి. తినుబండరాల్లా

పళ్ళు, కూరగాయలు, మొక్కలు, ఆకుల మీద దాడిచేసి తింటాయి. వాటి సంఖ్య ఇంకా పెరగడంతో ప్రకృతి స్వయం నియంత్రణ విధానం పనిచేయడం వల్ల అవి క్రమంగా పెద్ద గుంపులుగా సముద్రంవైపు ప్రయాణం ప్రారంభిస్తాయి. ఈ సుదీర్ఘ యానంలో బలహీనమైనవి దారిలోనే చావగా మిగిలినవి సముద్రంలో కలిసిపోతాయి.)

1041. సముద్రంలో పుట్టినా జీవితకాలమంతా సరస్సులలో, మంచినీటి మడుగులలో బతికే చేప ఏది?
(యూరోపియన్ ఈల్ చేప. పామును పోలి వుండే ఈ చేప సముద్రంలో పుట్టి క్రమంగా ఈదుకుంటూ నదులు, సరస్సులవైపు ప్రయాణిస్తుంది. తర్వాత భూగర్భజలాల ద్వారా సరస్సులోకో, నీటి మడుగుల్లోకో చేరుకుంటుంది. నీరు ప్రశాంతంగా వుండే చోటునే అది కోరుకుంటుంది.)

1042. సాలమన్ చేప సముద్రం నుంచి నదిలోకి ఎందువల్ల వస్తుంది?
(కేవలం గుడ్లు పెట్టడానికి మాత్రమే. ఈ చేప నదులు సముద్రంలో కలిసే ప్రదేశానికి వెళ్ళి అలలకు ఎదురీది నదిలో ప్రవేశించి గుడ్లు పెడుతుంది. అక్కడే చనిపోతుంది.)

1043. యుద్ధ విమానాలు ఎందుకు ఎక్కువ ఎత్తులో ఎగురుతాయి?
(రాడార్ల పరిధి నుంచి తప్పించుకోవడానికి.)

1044. నాటికల్ మైల్ అంటే ఏమిటి?
(సముద్రంలోనూ, మహా సాగరాల్లోనూ దూరాన్ని కొలిచే కొలమానం. ఒక నాటికల్ మైలు 1853 మీటర్లకు లేక 1.85 కిలోమీటర్లకు సమానం.)

1045. 'నాటిలస్' ఏ రంగంలో ప్రసిద్ధి పొందింది?
(నాటిలస్ అనేది న్యూక్లియర్ సబ్‌మెరైన్. అది గడ్డకట్టిన మంచును చేదించుకుని, మంచు అడుగు నుండి ప్రయాణించి ఉత్తరధృవాన్ని చేరుకుంది.)

1046. Fathom అంటే ఏమిటి?
(నీటి లోతును కొలిచే ఒక కొలమానం. ఒక ఫాథమ్ 6 అడుగుల లోతుకు సమానం.)

1047. ఇంతవరకు రికార్డయిన అత్యల్ప ఉష్ణోగ్రత ఎంత?
(జీరో డిగ్రీల కెల్విన్ నుండి 0.00003 డిగ్రీల వరకు. (అంటే– 273.15 డిగ్రీల సెల్సియస్). దీనిని టోక్యోలో ప్రొఫెసర్ ఓనో, అతని సహచరులు రికార్డు చేశారు.)

1048. సైక్లోట్రాన్ అంటే ఏమిటి?
(సైక్లోట్రాన్ అనే పదాన్ని చిట్టిన అణువు విషయంలో వినియోగిస్తారు.)

1049. కృత్రిమ కాంతికి అన్నిటికన్నా శక్తివంతమైన ఆధారం ఏది?
(లేసర్ కిరణాలు. ఇవి వెయ్యిమంది సూర్యుల కన్నా శక్తివంతమైనవి.)

1050. యాంటీమాలెక్యూల్స్ అంటే ఏమిటి?
(యాంటీ ప్రోటాన్లు, యాంటీ న్యూట్రాన్లు. పాసిట్రాన్‌తో తయారైన మాలెక్యూల్.)

1051. చంద్రుని మీద వాతావరణం లేదని మనకి తెలుసు. కానీ ఉపగ్రహాలలో మరొకటి ఏదైనా దాని సొంత వాతావరణాన్ని కలిగి వుందా?
(శని యొక్క ఉపగ్రహాల్లోని టైటాన్‌లో వుంది. కానీ అది మిథేన్ గ్యాస్‌ను మాత్రమే కలిగి వుంది.)

1052. టెలిస్కోపు లేకుండా మనం చూడగలిగిన అత్యంత సుదూర నక్షత్రం ఏది?
(ఆండ్రోమిడానెబ్యులాలోని మెస్సియర్ - 31. ఇది భూమికి 21,20,000 కాంతి మైళ్ళ దూరంలో వుంది.)

1053. సన్‌గ్లాస్‌లను ఎవరు కనిపెట్టారు?
(సన్‌గ్లాస్‌లను కనిపెట్టినవాడు క్రూక్స్. సూర్యుడి నుండి వెలువడే అతినీలలోహిత కిరణాల బారినుండి కళ్ళను కాపాడటానికి ఆయన వాటిని కనుగొన్నాడు.)

1054. ఒక వ్యక్తి లావుగా వున్నాడు. మరొకడు సాధారణంగా వున్నాడు, ఇద్దరిలో ఎవరు వేగంగా ఈత నేర్చుకోగలరు?
(లావుగా వున్న వ్యక్తి. ఎందువల్లనంటే సాధారణ వ్యక్తి కంటే అతను ఎక్కువ నీటిని స్థానభ్రంశం అయ్యేలా చేసి త్వరగా ఈత నేర్వగలడు.)

1055. గంగానది నుండి గంగోత్రి పుట్టింది. అయితే "దక్షిణ గంగోత్రి" నుండి పుట్టిన నది ఏది?
(ఏదీ లేదు. ఎందుచేతనంటే అది ఏ నదికీ జన్మస్థలి కాదు. 1982 అంటార్కిటిక్ మంచుఖండానికి వెళ్ళిన భారతీయ పరిశోధకుల బృందం తమ పరిశోధనా కేంద్రానికి పెట్టిన పేరు అది.)

1056. కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రిసెర్చ్‌కు వ్యవస్థాపక పిత ఎవరు?
(డాక్టర్ శాంతిస్వరూప్ భట్నగర్. CSIR 1942 లో స్థాపించబడింది.)

1057. రాయల్ ఏషియాటిక్ ఎప్పుడు ఏర్పడినది?

(దానిని 1784 లో, కలకత్తాలో సర్ విలియం జోన్స్ స్థాపించారు.)

1058. మనదేశంలో 'వైరస్'ల మీద పరిశోధనలు నిర్వహించడానికి నెలకొల్పిన సంస్థ ఏది?

(వైరస్ రిసెర్చ్ సెంటర్, పూనే. దీనిని ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చ్; రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ వారు సంయుక్తంగా స్థాపించారు.

1059. మొట్టమొదటి ఆధునిక వేధశాల (Observatory) ఎప్పుడు, ఎక్కడ స్థాపించారు?

(1898 లో కొడైకెనాల్ (తమిళనాడు)లో. అది 1792 లో స్థాపించిన మద్రాసు వేధశాలలో ఒక భాగం.)

1060. అక్యుపేషనల్ హెల్త్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ ఎక్కడ వుంది? దాని విధులేమిటి?

(గుజరాత్ రాష్ట్రంలోని అహ్మదాబాద్‌లో వుంది. ఇది వృత్తిపరమైన వ్యాధుల గురించి, వాటి నివారణ గురించి అధ్యయనం చేయడానికి స్థాపించబడింది.)

1061. ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ రిసెర్చ్‌ను ఎప్పుడు స్థాపించారు?

(1911 లో. అప్పట్లో దాని పేరు ఇండియన్ రిసెర్చ్ ఫండ్ అసోసియేషన్, ఆ పేరు మార్చి ఇప్పటి పేరును 1949 లో పెట్టారు.)

1062. PUSA ఇన్‌స్టిట్యూట్ అని ఏ సంస్థకు పేరుపెట్టారు? అది ఎక్కడ వుంది?

(ఇండియన్ ఎగ్రికల్చరల్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, ఢిల్లీ.)

1063. సముద్రమూ, ఆకాశమూ నీలంగా ఎందుకుంటాయి?

(భూమి చుట్టూ వున్న వాతావరణంలో వర్ణపటలం వుంది. అందులో నుండి ఒక్క నీలంరంగు బాగా చెల్లాచెదురై మిగతావి తొలగించబడతాయి. ఇలా వెదజల్లబడిన నీలివర్ణపటలంవల్ల ఆకాశం, సముద్రం నీలంగా కనబడతాయి.)

1064. పిచ్చికుక్క కరిస్తే వచ్చే వ్యాధి?

(హైడ్రోఫోబియా.)

1065. ఏ కెమెరా వలన కొన్ని నిమిషాలలో మనం తీసిన ఫోటోను ప్రత్యక్షంగా చూడగలం?

(పోలరాయిడ్.)

1066. 'ఆరిజన్ ఆఫ్ స్పీషీస్' గ్రంథాన్ని ఎవరు రచించారు?
(ఛార్లెస్ డార్విన్.)

1067. కొవ్వొత్తి మంట ఎప్పుడూ పైకే పోవడానికి కారణం ఏమిటి?
(కొవ్వొత్తిని మండించినప్పుడు దాని చుట్టూ వున్న గాలి వేడెక్కి తేలిక అవడంవల్ల పైకి లేస్తుంది. అలా పైకి లేచే గాలితోపాటు కొవ్వొత్తిమంట కూడా ఎప్పుడూ పైకి లేస్తుంటుంది.)

1068. ఎక్స్‌రేను ఎప్పుడు ఎవరు కనిపెట్టారు?
(1895 లో విల్‌హెల్మ్ కాన్రాడ్ డోయెంగ్‌టన్.)

1069. భారజలం మరిగే స్థానం, ఘనీభవించే స్థానం ఏమిటి?
(మరిగే స్థానం, 101.4 సెంటిగ్రేడ్ డిగ్రీలు. ఘనీభవించే స్థానం 3.8 సెంటిగ్రేడ్ డిగ్రీలు.)

1070. సెలిసియస్‌కూ, సెంటిగ్రేడుకూ తేడా [illegible] ?
(సెలియస్ అనేది సెంటిగ్రేడుకు గల [illegible] పేరు.)

107[illegible]. Lye[illegible] అంటే ఏమిటి?
[illegible]థమైన ఆల్కాలి. దీనిని సోడియం హైడ్రాక్సైడ్ అని కూడా [illegible]టారు.)

[illegible]ater-glass అంటే ఏమిటి?
([illegible]ోడియం సిలికేట్.)

1073. దాహం అనిపించకపోయినా నీరు తాగనందువల్ల మనిషి మరణించే అవకాశం వుందా?
(ఉంది. గొంతు తడిగా వున్నట్లయితే ఎవరికైనా దాహం అనిపించదు. శరీరంలో వుండవలసిన దానికన్నా నీటి పరిమాణం తగ్గినప్పుడు దాహ మనిపిస్తుంది. ఇలా నిరంతరాయంగా జరుగుతుంది. శరీరంలో నీరు, సమతూకంగా వుండేలా నియంత్రించే పనిని వెన్నెముకకు పై భాగాన మెదడుకు మధ్యలో వుండే హైపొథాలమస్ అనే అవయవం నిర్వహిస్తుంది.)

1074. మన శరీరంలోని ఎముకలలో నీరు వుంటుందా?
(ఉంటుంది. సుమారు 22 శాతం.)

1075. ఎడారి ఎలుకలు తమ దాహాన్ని ఎలా తీర్చుకుంటాయి? తమ శరీరానికి అవసరమైన నీటిని ఎలా పొందుతాయి?
(ఎడారి ఎలుకలు స్వల్పంగా నీటిని కలిగే విత్తనాలను, మొక్కలను తింటాయి. అందువల్ల ఆ విత్తనాలనుండి హైడ్రోజన్‌ను, వాతావరణంలో

నుండి ఆక్సిజన్‌ను పొందుతాయి. ఆ రెంటి మిశ్రమం నీరు కావడం ద్వారా నీటి అవసరం తీరుతుంది.)

1076. మగవారి శరీరంలో కన్నా స్త్రీల శరీరంలో నీరు తక్కువగా వుంటుందా?
(ఒక సగటు మనిషి శరీరంలో 75 శాతం నీరుంటుంది. అయితే శరీరంలో వుండే నీటి శాతంలో ఒక వ్యక్తికీ, మరో వ్యక్తికీ మధ్య తేడా వుండవచ్చు. ఉదాహరణకి సన్నగా వున్న ఒక వ్యక్తి శరీరంలో నీరు 75% కన్నా తక్కువ వుంటుంది. స్త్రీ శరీరంలో 52% పరిమాణంలో వుంటుంది.)

1077. సాధారణంగా ఎడారులలో శరీరం నుండి ఎక్కువగా నీరు కోల్పోవడం వల్ల మనుషులు మరణిస్తారు. అలాంటప్పుడు మన శరీరానికి అవసరమైన నీటి అవసరాన్ని మనం ఎలా తగ్గించుకోవాలి?
(చెమట రూపంలో మన శరీరం నీటిని కోల్పోతుంది. మనం నీడలో విశ్రాంతిగా కూర్చున్నట్లయితే మనం కొద్దిపాటి నీటితో సరిపెట్టుకోవచ్చు.)

1078. పుచ్చకాయలో వుండే నీరు ఎంత?
(97 శాతం.)

1079. సముద్రం మీద మనిషి దాహపీడితుడై ఎందువల్ల మరణిస్తాడు? శాస్త్రీయమైన కారణం ఏమిటి?
(సముద్రపు నీటిలో 3.5% లవణాలు వుంటాయి. కానీ మనిషి శరీరం 0.9% లవణాలను మాత్రమే భరించగలుగుతుంది. శరీరంలో లవణ పదార్థాలు ఎక్కువ అయినట్లయితే వాటిని తొలగించడానికి మూత్ర పిండాలు పనిచేస్తాయి. అవి సమర్థవంతంగా పనిచేయాలంటే మరింత నీరు తాగడం అవసరం. మనిషి శరీరం 2.2%కు మించి అధిక లవణ పదార్థాలను స్వీకరించలేదు. స్వీకరించి తట్టుకోలేదు. అందువల్ల మనిషి 3.5% లవణాలున్న సముద్రపు నీటిని తాగితే, ఆ అదనపు లవణ పదార్థాలను మూత్రపిండాలు తొలగించే క్రమంలో శరీరం మరింత నీటిని కోల్పోతుంది. ఈ క్రమంలో సముద్రంమీద మనిషి దాహపీడితుడై చనిపోతాడు.)

1080. Civet cat ప్రజలకు ఎందువల్ల అభిమాన పాత్రమైంది?
(దాని నుండి వెలువడే కస్తూరి పరిమళం వంటి వాసనవల్ల)

1081. భూమిమీద లభించే నీటిలో ఎంత శాతం తీయదనం వుంటే త్రాగడానికి అనువుగా వుంటుంది.
(సుమారు రెండు శాతం.)

1082. సి. వి. రామన్‌కు భౌతికశాస్త్రంలో నోబెల్ ప్రైజు ఎప్పుడు లభించింది? ఆయన ఎప్పుడు, ఎక్కడ జన్మించారు?

(సి. వి. రామన్ 1930లో నోబెల్‌ప్రైజు స్వీకరించారు. ఆయన దక్షిణ భారతదేశంలోని తిరుచునాపల్లిలో నవంబరు 7న జన్మించారు.)

1083. అల్ప ఉష్ణోగ్రతలో ద్రవంగా మారే గ్యాస్ ఏది?

(హీలియం. ఇది – 269 సెంటిగ్రేడు వద్ద ద్రవంగా మారుతుంది.)

1084. ఐన్‌స్టీన్ తన జీవితంలోని చివరిభాగంలో ఎక్కువ సమయం భౌతిక శాస్త్రంలోని ఒక నిర్దిష్ట సమస్య పరిష్కారానికి వెచ్చించారు. అదీ ఆయన చివరి స్వప్నం కూడా! ఏమిటా సమస్య?

(ప్రకృతిలోని సకల మౌలికశక్తుల ఏకీకరణ సమస్య – అనే విషయంపై ఐన్‌స్టీన్ కృషి చేశారు. ఆ సిద్ధాంతం నేటికీ అసంపూర్తిగానే వుంది. దానిని "Unified field theory" అంటారు.)

1085. Hydrogenated Oil అంటే ఏమిటి?

(హైడ్రోజనేటెడ్ తైలాలు అంటే ద్రవరూపంలోని తైలాలను హైడ్రోజన్ ద్వారా ఘనీభవింపజేసిన తైలాలు. మనకిప్పుడు మార్కెట్‌లో 'వనస్పతి'గా లభించుతున్న నూనెలు అటువంటివే.)

1086. సముద్రజలాల నుండి బంగారాన్ని రాబట్టడానికి ప్రయత్నం చేసిన శాస్త్రవేత్త ఎవరు?

(నోబెల్ బహుమతి గ్రహీత అయిన జర్మన్ దేశీయుడు ఫ్రిట్జ్‌హాబర్. అతను జర్మనీ దేశానికి ఋణాలు లేకుండా చేయాలనుకున్నాడు. అందుకే సముద్రపు నీటితో బంగారం తయారు చేయాలని పరిశోధనలు చేశాడు. కానీ అతని శ్రమ ఫలించలేదు. ఎందుచేతనంటే ఆ పద్ధతిలో బంగారం తయారుచేయడానికి మార్కెట్లో బంగారం లభించే ధరకన్నా ఎక్కువ ఖర్చు అవుతుంది.)

1087 Polymetallic Nodules అంటే ఏవి?

(మహాసాగరాల అడుగున పోలిమెటాలిక్ నాడ్యూల్స్ వుంటాయి. అవి బంగాళదుంపల ఆకారాన్ని పోలి వుంటాయి. నీటిలో పెద్ద పరిమాణంలో మాంగనీసు, ఇనుము, నికెల్, కోబాల్ట్, తదితర లోహాలుండి వుంటాయని వాదనలు జరుగుతున్నాయి. శాస్త్రవేత్తలు నీటిలోనుండి లోహాలను వెలికి తీయడానికి పథకాలు వేస్తున్నారు.)

**1088.** మహాసాగర పరిశోధనలో మనం సాధించిన అంతర్జాతీయస్థాయి విజయం ఏమిటి?

(హిందూమహాసముద్రం అడుగునుండి పోలీమెటాలిక్ నాడ్యూల్స్‌ని వెలికితీయడానికి ఐక్యరాజ్యసమితి అంగీకారం మనదేశానికి లభించింది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఈ గౌరవం ఒక్క మనదేశానికి మాత్రమే లభించింది.)

**1089.** ఒక సంవత్సరకాలంలో ఒక చదరపు మీటరు స్థలం నుండి మనం ఎంత సౌరశక్తిని పొందగలం?

(సుమారు 4 కిలోవాట్లు. ఒక సంవత్సర కాలంలో అది $6 \times 10^{17}$ కిలోవాట్లు అవుతుంది.)

**1090.** డాక్టర్ సలీమ్ ఆలీ దేనిలో ప్రసిద్ధులు?

(డాక్టర్ సలీమ్ ఆలీ సుప్రసిద్ధ ఆర్నితాలజిస్టు (పక్షుల పరిశీలనా శాస్త్రవేత్త.) ఆయన భారత్, పాకిస్తాన్‌లలోని అనేక పక్షులకు సంబంధించిన వివరాలను అధ్యయనం చేశాడు. పర్యావరణ రక్షణకు ఆయన చేసిన సూచనలు, సలహాలు ఎంతో గొప్పవి.)

**1091.** భౌతికశాస్త్ర రంగానికి చేసిన అమూల్యమైన సేవలకుగాను నోబెల్ ప్రైజు అందుకున్న తొలి భారతీయుడు ఎవరు?

(డాక్టర్ చంద్రశేఖర్ వెంకట్రామన్. ఆయన 1930 లో ఫిజిక్స్‌కు సంబంధించిన నోబెల్ ప్రైజును అందుకున్నారు. 'రామన్ ఎఫెక్ట్' సిద్ధాంతంతో ఆయన విఖ్యాతి పొందారు.)

**1092.** భారతదేశంలో 1987 లో ఒక గణితశాస్త్రవేత్త శత జయంత్యుత్సవాలు జరిగాయి. ఆయన ఎవరు?

(శ్రీనివాస రామానుజం)

**1093.** ఓజోన్ పొర అదృశ్యమవుతున్నదా? ఎందుకని?

(అవును. వాతావరణ కాలుష్యం కారణంగా, గాలిలో ఫ్లోరోకార్బన్లు ఏర్పడుతున్నందున ఓజోన్ పొర క్రమంగా అదృశ్యమవుతున్నది.)

**1094.** Debugging అంటే ఏమిటి?

(కంప్యూటర్‌లోనూ – అది పనిచేసే విధానంలోనూ లోపాలు, తప్పులను కనిపెట్టి, సరిదిద్దే విధానం.)

**1095.** విద్యుత్తరంగ వేగమెంత?

(ఒక విద్యుత్ తరంగం – ఒక్క సెకను వ్యవధిలోగా పదకొండుసార్లు భూమిని చుట్టి వచ్చేంత వేగంగా పయనించగలదు.)

1096. C.A.T. అది దేనికి వినియోగపడుతుంది?
(కంప్యూటరైజ్డ్ ఆక్సిల్ టోమోగ్రఫీ. దీని ద్వారా దృశ్యాన్ని తెరపై ప్రదర్శించి. పొరపాట్లను కనుగొంటారు.)

1097. Biopsy అంటే ఏమిటి?
(కేన్సర్ వంటి వ్యాధులను కనుగొనే నిమిత్తం శరీరంలో నుండి ద్రవాన్ని గాని, కణాలను గాని వెలికితీసి పరీక్షచేసే విధానం.)

1098. Anaesthesiaను మొట్టమొదట వినియోగించింది ఎవరు?
1842లో అమెరికన్ డాక్టర్ క్రాఫర్డ్‌లాంగ్. మత్తు కలిగించడానికి ఆయన ఈథర్‌ను వినియోగించాడు.)

1099. 'రేడియం లేడీ' అంటే ఎవరు?
(మేడమ్‌క్యూరీ. ఈమె 1903లో భౌతిక శాస్త్రంలోనూ, 1917లో రసాయన శాస్త్రంలోనూ నోబెల్ ప్రైజు పొందారు. ఇది ఎంతో అరుదైన విషయం )

1100. సౌరశక్తిలో ఎంత భాగాన్ని మొక్కలు, చెట్లు వినియోగించుకుంటున్నాయి?
(భూమిమీదకు ప్రసారమయ్యే సౌరశక్తిలో కేవలం 2% మాత్రమే మొక్కలు, చెట్లు వినియోగించుకుంటున్నాయి. అవి సౌరశక్తిని ఆహారంగా మార్చుకుంటాయి.)

1101. వృక్ష శరీర ధర్మశాస్త్ర పితామహుడెవరు? (జె.సి. బోస్)

1102. అటవీ పరిశోధనా సంస్థ ఎచ్చట ఉంది? (డార్జిలింగ్)

1103. సిల్వి కల్చర్ అంటే ఏమిటి? (కూరగాయల మొక్కల వృద్ధి)

1104. పరాగ రేణువుల గూర్చి వివరించు శాస్త్రం ఏది? (పాలినోలజి)

1105. గిరిజన జాతులు ఉపయోగించు మందు మొక్కలను గురించి వివరించు శాస్త్రం ఏది? (ఎథ్నో బాటనీ)

1106. భారతదేశంలో వృక్ష పురాజీవ శాస్త్రపిత ఎవరు? (బీర్‌బల్ సహని)

1107. ఫెర్న్ మొక్కల గురించి వివరించు శాస్త్రం ఏది? (టెరిడాలజి)

1108. కీటకాహార మొక్కలు ఏ ఎంజైములను ఉత్పత్తి చేస్తాయి? (ప్రోటియేజ్)

1109. 'ఫామిలీస్ ఆఫ్ ఫ్లవరింగ్ ప్లాంట్స్' అనే పుస్తకాన్ని రాసిన శాస్త్రవేత్త ఎవరు? (హచిన్‌సన్)

1110. టాక్సానమీ అనే పదాన్ని మొదట ప్రయోగించినదెవరు? (డీ కండోలి)

1111. ఏ ఫలాన్ని 'ప్రైడ్ ఫ్రూట్ ఆఫ్ ఇండియా' అని అంటారు? (మామిడి)

1112. చపురు నుండి లభించే ఆల్కాలాయిడ్? (హాయసైమిన్ స్కోపలమైన్)

1113. కణ అవిచ్ఛిన్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించినదెవరు? (రుడాల్ఫ్ విర్షో)

1114. ఫేజ్ కంట్రాస్ట్ సూక్ష్మదర్శినిని కనుగొన్నదెవరు? (జర్నికే)

1115. లూకోప్లాస్టులు వీటిలో ఉంటాయి?

(ఆహార పదార్థాలను నిల్వచేయు మృదుకణజాలంలో)

1116. లైసోసోములను కనుగొన్న శాస్త్రవేత్త? (క్రిస్టియన్ డెడువె)

1117. క్రోమోజోములలో ఉండు ప్రోటీన్లను ఏమంటారు? (హిస్టోన్‌లు)

1118. మైటోకాండ్రియాలను మొదట కనుగొన్న శాస్త్రవేత్త? (ఆల్ట్‌మాన్)

1119. అతితక్కువ క్రోమోజోములు గల జంతువు ఏది?

(అస్కారిస్ మెగాలో సెఫాలా)

1120. అతితక్కువ క్రోమోజోములుగల మొక్క ఏది?

(హాప్లోపావస్ గ్రాసిలిస్)

1121. వృక్ష, జంతు లక్షణాలను ప్రదర్శించు ప్రోటోజోన్ ఏది? (యుగ్లీనా)

1122. మానవుని పేగులో పుండ్లు (Ulcers)ను కలుగచేయు ప్రోటోజోవా పరాన్నజీవి ఏది? (ఎంటమిబా హిస్టోలిటికా)

1123 అమీబాను మొదట కనుగొన్న శాస్త్రవేత్త? (రోసెల్ వాన్ రోసెన్ హాఫ్)

1124. స్పంజికల గురించి వివరించు శాస్త్రాన్ని ఏమంటారు? (సారా జువాలోజీ)

1125. 'అమెరికన్ మర్డరర్' లేదా కొత్త ప్రపంచపు కొంకిపురుగు అని దేన్ని అంటారు? (నెకేటర్ అమెరికానస్)

1126. చైనా నుండి నీలగిరి సరస్సులలోకి ప్రవేశపెట్టబడిన చేప ఏది?

(సిప్రినస్ కార్పియా)

1127. కాల్షియం అధికంగాగల చేప ఏది? (సిల్వర్ జెల్లి)

1128. కోళ్ళ పరిశ్రమ పరిభాషలో 'లిట్టర్' అనగా (షెడ్డు నేలపై పొట్టు)

1129. NECC అనగా (నేషనల్ ఎగ్ కో-ఆర్డినేషన్ కమిటీ)

1130. చేపలలో సమృద్ధిగా లభించే విటమిన్‌లు ఏవి? ('ఎ' మరియు 'డి')

1131. నీటిలో బ్లీచింగ్ పౌడర్ మోతాదు ఎక్కువైతే వచ్చే వ్యాధి ఏది?

(డయేరియా)

1132. ఎరోసాల్స్‌లో ఉండే రసాయనిక సంయోగ పదార్థాలేవి?

(ఫ్లూరో కార్బనులు)

1133. మొక్కలలో పత్రహరితము క్షీణింపచేయు కాలుష్యపదార్థం ఏది?

(సల్ఫర్ డై ఆక్సైడ్)

1134. నివాస సిద్ధాంతమును తెలిపినవారు? (అంగర్)

1135. వేరు పీడనమును కొలుచుటకు ఉపయోగించు సాధనము? (మానోమీటర్)

1136. మొట్టమొదటగా సిద్ధాంతపరంగా రక్షక కణాలు మూసుకొనుట, తెరుచు కొనుట తెలిపినది. (వాన్ మోల్)

1137. బాష్పోత్సేక రేటును కొలుచు సాధనము. (పోటోమీటరు)

1138. మొక్కలలో ఉష్ణోగ్రత సమతూకాన్ని సరిచేయు క్రియ. (బాష్పోత్సేక క్రియ)

1139. బాష్పోత్సేక రేటు ఎక్కువగా ఉండు కాలము (వేసవి కాలము)

1140. బాష్పోత్సేకమును 'దినసరి ఈవిల్'గా వర్ణించినవారు. (కర్టిస్)

1141. ద్రవోద్గమ సిద్ధాంతమును తెలిపిన ఇండియాకు చెందిన శాస్త్రవేత్త? (జె.సి. బోస్)

1142. పొగ, మంచు కలసి ఏర్పడునది? (స్మాగ్)

1143. తాజ్‌మహల్ కట్టడానికి హాని కలిగిస్తున్న కాలుష్యం ఏది? (సల్ఫర్ డై ఆక్సైడ్)

1144 దేహాలు కలుసుకొని పుట్టిన కవలలను ఏమని పిలుస్తారు? (సయామీస్ కవలలు)

1145 పాశ్చరైజేషన్ అనగా – (పాలను 60$^0$ వద్ద వేడిచేసి వెంటనే చల్లార్చుట)

1146. వాస్కులార్ కిప్టోగ్రాములు అనగా – (టెరిడోఫైటా)

1147. ఆవరణ వ్యవస్థలో పిరమిడుల భావనను ప్రవేశపెట్టినదెవరు? (ఛార్లెస్ ఎల్టాన్)

1148. ఋతువులలో కలిగే మార్పులను శాస్త్రీయంగా తెలుపు శాస్త్ర విభాగాన్ని ఏమంటారు? (ఫెనాలజీ)

1149. మొక్క ఉనికి, దాని జీవిత చరిత్రకు మధ్యగల సంబంధాన్ని వివరించు శాస్త్రాన్ని ఏమంటారు? (ఆటికాలజీ)

1150. నీటిలో పెరిగే మొక్కలను ఏమంటారు? (సియాఫైటులు)

1151. భారతదేశపు హరిత విప్లవ పితామహుడెవరు? (ఎం. ఎస్. స్వామినాథన్)

1152. 'కైగా' న్యూక్లియర్ పవర్ స్టేషన్ ఏ రాష్ట్రంలో ఉంది? (కర్నాటక)

1153. ఓడ వేగాన్ని ఏ యూనిట్‌తో కొలుస్తారు? (Knot)

1154. బరౌనీ నూనె శుద్ధి కర్మాగారం ఎచట ఉంది? (బీహార్)

1155. మిలిటరీ టాంక్‌ను కనుగొన్నదెవరు? (స్వింటన్)

1156. డా॥ సి. వి. రామన్‌కు ఏ రంగంలో నోబెల్ పురస్కారం లభించింది? (భౌతికశాస్త్రం)

1157. పెరియర్ వన్యమృగ సంరక్షణ కేంద్రం ఎక్కడ ఉంది? (కేరళ)

1158. ఆయుర్వేదం గురించి ఏ వేదంలో ప్రస్తావించబడింది? (అథర్వణ వేదం)

1159. 'లాండ్ ఆఫ్ మిడ్ నైట్ సన్' అని దేన్ని పిలుస్తారు? (నార్వే)

1160. ది డాల్ఫింగ్ రోబట్ అంటే ఏమిటి? (క్లీనింగ్ పనులుచేసే మరమనిషి)

1161. పి. హెచ్. (ph) అంటే ఏమిటి? (ఒక ద్రవం యొక్క అమ్ల లేదా క్షార ధర్మాన్ని కొలిచే యూనిట్)

1162. సి. ఎ. ఎఫ్. ఎస్. అంటే ఏమిటి? (కంప్యూటర్లలో ఉపయోగించే కంటెంట్ ఎడ్రెస్సబుల్ ఫైల్ స్టోర్ వ్యవస్థ)

1163. ఒ. ఎస్. ఎల్. ఎ. ఎన్. అనగా నేమి? (కంప్యూటర్లలో వాడే ఓపెన్ సిస్టమ్స్ లోకల్ ఏరియా నెట్ వర్క్ వ్యవస్థ)

1164. ఎ. ఎస్. టి. ఆర్. ఎ. అనగానేమి? (అప్లికేషన్ ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజి టు రూరల్ ఏరియా)

1165. 'పి. హెచ్.-7' దేనిని సూచిస్తుంది? (ద్రవం యొక్క తటస్థస్థితిని)

1166. టాకియాన్స్ (Tachyons) అంటే ఏమిటి? (కాంతి వేగం కన్నా ఎక్కువ వేగంతో పయనించే ఉపాణువులు)

1167. గ్రీన్‌బెల్ట్ ఉద్యమ నాయకురాలెవరు? (నాంగారిమత్తయ్, కెన్యా)

1168. ఎన్. ఎ. ఎస్. ఎ. అనగా నేమి? (నేషనల్ ఏరోనాటిక్స్ అండ్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్)

1169. GNAT అనగా నేమి? (భారత్ యుద్ధ విమానం)

1170. 'అంటార్కిటికా కన్వర్జెన్స్' అంటే ఏమిటి? (అంటార్కిటికా చుట్టూ సముద్రంలో ఉత్తరం నుండి వేడినీరు, దక్షిణం నుండి చల్లని నీరు కలిసే ప్రదేశం)

1171. 'బిగ్-ఐ' అంటే ఏమిటి? (అంటార్కిటికా మంచు వాతావరణంలో కొందరికి ఉన్న వస్తువులు పెద్దవిగా కనిపించే సైకలాజికల్ ప్రభావం)

1172 'లాగ్ - 3' అంటే ఏమిటి? (అంటార్కిటికా మంచు వాతావరణంలో కొందరికి వస్తువులు పొడవు-వెడల్పులు ఎక్కువగా కనిపించే సైకలాజికల్ ఎఫెక్ట్)

1173. శ్వేతాంధకారం అంటే ఏమిటి? (అంటార్కిటికాలో ఒక్కొక్కసారి సూర్యకిరణాలు నిట్టనిలువుగా పైనుంచి క్రిందకి ప్రసరిస్తూ వస్తువులను కనబడనీయవు దీన్ని శ్వేతాంధకారం అంటారు)

1174. అతివేగంగా పరిగెత్తే కుక్క ఏది? (పర్షియన్ గ్రేహౌండ్)

1175. ఉలాద్వా నేషనల్ పార్క్ ఏ రాష్ట్రంలో వుంది? (ఉత్తరప్రదేశ్)

1176. నవీన ఆవర్తన పట్టికలోని గ్రూపులు, పీరియడ్‌లు ఎన్ని? (18 గ్రూపులు, 7 పీరియడ్‌లు)

1177. ఖనిజాన్ని గాలి లేకుండా వేడిచేయడాన్ని ఏమంటారు? (కాల్సినేషన్)

1178. వాయు సిద్ధాంతం (R) యొక్క విలువ –

(0.082 లీ అట్మా/ డిగ్రీ మోల్)

($8.314 \times 10^7$ ఎర్గ/ డిగ్రీ మోల్)

(9.314 జౌల్/ డిగ్రీ మోల్)

(1.987 కేలోరీ/ డిగ్రీ మోల్)

1179. అత్యధిక దూరం ప్రయాణం చేయు పక్షి ఏది? (ఆర్కిటిక్ టెర్న్)

1180. హైడ్రోజన్ బాంబు తయారీలో ఉపయోగించే సూత్రం (కేంద్ర సంలీనం)

1181. కటాడ్రమస్ ప్రవాసం అంటే ఏమిటి? (నదుల నుండి సముద్రాలకు ఈల్ చేపలు వంటివి చేయు ప్రవాసం)

1182. ఎనాడ్రామస్ ప్రవాసం అంటే ఏమిటి? (సామన్, హిలిలిషా వంటివి సముద్రాల నుండి నదులలోకి చేయు ప్రవాసం)

1183. కొయాలి చమురు శుద్ధి కర్మాగారం ఏ రాష్ట్రంలో ఉంది? (గుజరాత్)

1184. తల్‌చేరి సూపర్ థర్మల్ పవర్ ప్రాజెక్టు ఏ రాష్ట్రంలో ఉంది? (ఒరిస్సా)

1185. భారతదేశంలో విమానయాన పితామహుడు? (జె. ఆర్. డి. టాటా)

1186. కొవ్వొత్తుల తయారీలో వాడే పదార్థం ఏది? (ప్యారాఫిన్)

1187. తల్లి గర్భాశయానికి, పిండానికి మధ్యగల సేతువు? (ప్లాసెంటా)

1188. ఆవేశం లేని రేడియో ధార్మిక కిరణాలు? (గామా కిరణాలు)

1189. పిడుగు ఎప్పుడు ఏర్పడుతుంది? (రెండు మేఘాల మధ్య విద్యుత్ ఉత్సర్గం జరిగినపుడు)

1190. పిచ్‌బ్లెండ్‌లో వుండే రేడియో ధార్మిక మూలకం ఏది? (ప్లుటోనియం)

1191. పొగమంచులో ఫొటో తీయడానికి ఉపయోగించు కిరణాలు? (పరారుణ కిరణాలు)

1192 టార్నడోలు అనగా – (అమెరికాలోని తీవ్రమైన గాలివానలు)

1193. డోలమైట్‌లో వుండే లోహం ఏది? (మెగ్నీషియం)

1194. కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసెర్చి ఆధ్వర్యంలో అనుసంధాన ప్రయోగశాలల స్థాపనకు కారకుడైన వైజ్ఞానికుడెవరు? (ఎస్. ఎస్. భట్నగర్)

1195. కాంతి యొక్క ప్రాథమిక కణాన్ని ఏమంటారు? (ఫోటాను)

1196. స్కూబా (SCUBA) అనగా? (సెల్ఫ్ కంటెయిన్ అండర్ వాటర్ బ్రీథింగ్ ఏపరేటస్. నీటిలో శ్వాసక్రియకు దీన్ని ఉపయోగిస్తారు)

1197. యాంటీఫ్రీజ్ అనగానేమి? (నీరు గడ్డకట్టకుండా ఉపయోగించే రసాయన పదార్థాలు. ఉదా: ఇథిలీన్ గ్లైకాల్)

1198. అన్నీలింగ్ అనగా నేమి? (ఎక్కువ ఉష్ణోగ్రత వద్ద గాజు లేదా లోహాన్ని నెమ్మదిగా ఒక క్రమపద్ధతిలో చల్లార్చే ప్రక్రియ)

1199. హోలోగ్రఫీ అనగా నేమి? (ఒక వస్తువును త్రిమితీయంగా (3-D) అనగా వెడల్పు, పొడవు, లోతులు చిత్రించే ఫోటోగ్రఫీని హోలోగ్రఫీ అంటారు)

1200. మొట్టమొదట తయారుచేసిన ఆటంబాంబు పేరేమిటి? (లిటిల్ బోయ్)

1201. ద్రవోద్గమమునకు తన్యతా సిద్ధాంతమును ప్రతిపాదించినవారు (డిక్సన్ అండ్ జాలీ)

1202. రెండవ ఆటంబాంబు పేరేమిటి? (ఫాట్ మెన్)

1203. రేడియో ధార్మిక కార్బన్‌ను ఉపయోగించే పద్ధతిని ఎవరు కనుగొన్నారు? లిబ్బీ - (1947)

1204. ఆటామిక్ సెకండ్ అనగానేమి? (సీసియంలోని ఎలక్ట్రాన్ 9,192 631,770 భ్రమణాలు చేయడానికి పట్టే కాలాన్ని ఒక ఆటామిక్ సెకండ్ అంటారు.)

# తరతరాల విజ్ఞానశాస్త్ర పురోగతి

ఖగోళశాస్త్రం : నక్షత్ర (నక్షత్రాలు, నక్షత్ర సముదాయాలు) వ్యవస్థ. కృత్తికాది 27 లేదా 28 నక్షత్రాల గుర్తింపు.

తైత్తరీయ సంహిత - క్రీ.పూ. 800-700 - భారత్ : అంకగణిత అభివృద్ధి, బేసి, సరి సంఖ్యల గమనింపు.

పంచవింశ బ్రాహ్మణ - క్రీ.పూ. 800-700 - భారత్ : క్షేత్ర గణితాభివృద్ధి.

సప్తపథ బ్రాహ్మణ - క్రీ.పూ. 800-700 భారత్ : అంకగణితాల, క్షేత్ర గణితాల క్రోడీకరణ.

శుల్బ సూత్రాలు - క్రీ.పూ. 700-600 - భారత్ : నిలువులు, చదరాలు, ట్రిపీజియంలు గీసే సూత్రాల రూపకల్పన, రుజు సంఖ్యల సమ్మేళన, రూపాంతరీకరణ.

లగధ - క్రీ.పూ. 600-500 - భారత్ : వేదాంగజ్యోతిష్య గ్రంథకర్త ఖగోళ శాస్త్ర అధ్యయనం - పంచాంగ గణితం - వేసవి, శీతాకాలాల కాల ప్రమాణీకరణ, దివారాత్రాల నడుమ కాలవ్యవధి నిర్ధారించుట.

బౌద్ధాయనం - క్రీ.పూ. 600-500 - భారత్ : క్షేత్రగణితం. పైథాగరస్ సిద్ధాంతాన్ని ముందుగానే ఊహించడం.

మాణవ - క్రీ.పూ. 600-500 - భారత్ : 'Π' (పై) విలువను 3.16049గా 5 దశాంశ స్థానాలలో నిర్ధారణ.

ఆపస్తంబ - క్రీ.పూ. 600.500 - భారత్ : స్క్వేర్‌రూట్, క్యూబ్‌రూట్ లెక్కించే విధాన ఆవిష్కరణ.

కాత్యాయన - క్రీ.పూ. 500-400 - భారత్ : అనిర్దిష్ట సమీకరణాలు.

కౌటిల్యుడు - క్రీ.పూ. 400-300 - భారత్ : అర్ధశాస్త్ర రచయిత. దీనిలో గనుల తవ్వకం, లోహశాస్త్రాలకు సంబంధించిన ఆనాటి శాస్త్రాల గురించి యాదృచ్ఛికంగా ప్రస్తావించబడింది.

భద్రబాహు - క్రీ.పూ. 300 - భారత్ : క్షేత్ర గణిత పరంపర యొక్క క్రోడీకరణ. కల్పసూత్ర రచయిత.

యూక్లిడ్ - క్రీ.పూ. 300 - గ్రీసు : ఎలిమెంట్స్ గ్రంథకర్త. క్షేత్ర గణిత సూత్రాల తొలి లాంఛనప్రాయ ఆవిష్కరణలు.

పింగళుడు - క్రీ.పూ. 200 - భారత్ : ఛందః సూత్ర గ్రంథకర్త, సంకలన వ్యవకలనాలు, మేరు ప్రస్థి లేదా పాస్కల్ త్రిభుజం.

ఆర్కిమెడీస్ - క్రీ.పూ. 200 - ద్రవస్థితి శాస్త్రం. నీటి స్థాన చలనాలకు సంబంధించిన సూత్రాలను కనుగొన్న శాస్త్రవేత్త.ఇవే ఆర్కిమెడిస్ సూత్రాలుగా ప్రసిద్ధి పొందాయి.

ఎరిస్టార్కస్ ఆఫ్ సామోస్ - క్రీ.పూ. 200 - గ్రీస్ : భూభ్రమణం, భూమి సూర్యుని చుట్టూ తిరగడానికి సంబంధించిన పరిశీలనలు, గణనలు.

ఎరెంటోస్థనీస్ - క్రీ.పూ. 200 - గ్రీస్ : మొట్టమొదటిసారిగా భూమి వ్యాసం (క్షైవారం) గణింపు.

చియూఛాంగ్ సువాన్‌షూ - క్రీ.పూ. రెండవ శతాబ్దం - చైనా : అంకగణితం ఒక వృత్తంలోని తొమ్మిది ఖండాల ద్వారా వైశాల్యం కనుగొనుట.

హిప్పార్చస్ - రెండవ శతాబ్దం - గ్రీస్ : భూమి నుండి సూర్య చంద్ర గ్రహాలకు దూరాన్ని లెక్కించుట - విషువత్‌ను ఖచ్చితంగా లెక్కించుట.

క్లాడియస్ టోలమీ - క్రీ.శ. 140 - గ్రీస్ : యూరప్‌లో ఖగోళశాస్త్ర విజ్ఞానాన్ని అభివృద్ధి చేశాడు. దీర్ఘకాలం యూరోపియన్ ఖగోళ శాస్త్రజ్ఞులకు మార్గదర్శకుడుగా వున్నాడు. 'ఆల్మజెస్ట్' అను ఖగోళశాస్త్ర గ్రంథాన్ని నిర్మించాడు.

ఆర్యభట్ట - క్రీ.శ. ఐదవ శతాబ్దం - భారత్ : ఆర్యభట్టీయ గ్రంథకర్త. భూభ్రమణ సిద్ధాంతం. గ్రహాల వర్తులాకార చలనాల సిద్ధాంతం. 'పై' విలువను 3.1416 గా నిర్ధారించిన గణిత శాస్త్రజ్ఞుడు. దశాంశ స్థానాల విలువలను అభివ్యక్తీకరించే అక్షరానుక్రమణిక పద్ధతి స్క్వేర్,రూట్ విలువలు రాబట్టుట.

బ్రహ్మగుప్త - క్రీ.శ. ఆరవ శతాబ్దం - భారత్ : బ్రహ్మస్ఫుట సిద్ధాంత గ్రంథం. దీనిలో అంకగణితము, బీజగణితము, రేఖా గణితము సమగ్రంగా వివరించబడినది. ఖండఖాద్యక గ్రంథాన్ని రచించాడు. సగటు గ్రహ సంచారాన్ని, వాస్తవ గ్రహసంచారాన్ని లెక్కించాడు. స్థల, కాల, దూరాల సమస్యలు - సూర్యచంద్ర గ్రహణాలు, గ్రహాల ఉదయాస్తమయాలు - చంద్రకళలు - సున్నా వినియోగం.

వరాహమిహిరుడు - క్రీ.శ. 6వ శతాబ్దం - భారత్ : ఖగోళశాస్త్ర సిద్ధాంతాలను ఆవిష్కరించిన సిద్ధాంత గ్రంథకర్త. బృహత్ సంహిత, యోగ యాత్ర ఇతర గ్రంథాలు.

అమరసింహుడు - క్రీ.శ. 6వ శతాబ్దం - భారత్ : సంస్కృత పదకోశం

అనదగిన అమరకోశము గ్రంథకర్త. మొక్కలు, జంతువులు, లోహాలు, ఖనిజాలు పోలికలు - వర్గీకరణ.

మొదటి భాస్కరుడు - క్రీ.శ. 7వ శతాబ్దం - భారత్ : మహాభాస్కరీయ గ్రంథ కర్త. గ్రహాల ఆయత సగటు, నక్షత్రాలు కూడలుల మధ్య పొడవు వెడల్పులు, గ్రహాల వాస్తవ దైర్ఘ్యము, గ్రహాల ఉదయాస్తమయాలు.

జెజీర్ ఇబ్న్ అయ్యాన్ (జెజీర్) క్రీ.పూ. 8వ శతాబ్దం మధ్య ప్రాచ్యం : రసవాద శాస్త్రం.

మహావీరుడు - క్రీ.శ. రెండవ శతాబ్దం - భారత్ : గణిత సార సంగ్రహ గ్రంథకర్త. క్షేత్ర గణితం, ఘనాలవిలువ, చతురస్రాల విలువ, ద్విచతురస్రాలు, ఘనపరిమాణాలు, సంకలన, వ్యయకలనాలతోసహా గణితశాస్త్ర సమగ్ర క్రోడీకరణ.

అల్ ఖ్వారిస్‌జీ - క్రీ.శ. 9వ శతాబ్దం - మధ్యప్రాచ్యం : అరబిక్‌లోని అంకెల సిద్ధాంత కర్త.

రెండవ భాస్కరుడు - క్రీ శ. 9వ శతాబ్దం - భారత్ : సిద్ధాంత శిరోమణి గ్రంథ కర్త. గణిత, ఖగోళశాస్త్రాలకు సంబంధించిన గ్రంథమిది. అవిభాజ్య, విభాజ్య సంఖ్యలను ఇదే ప్రతిపాదించింది. ప్రాచీన భారతీయ గణిత శాస్త్రానికి ఇది పట్టంకట్టింది.

గోవింద భగత్ - క్రీ.శ. 10వ శతాబ్దం - భారత్ : రసహృదయ గ్రంథకర్త. ఈ గ్రంథం రసవాద సిద్ధాంతాన్ని ఆవిష్కరించింది.

మంజుల - (T) క్రీ.శ 10వ శతాబ్దం - భారత్ : ఖగోళశాస్త్ర సిద్ధాంతం విషవత్తులను ఖచ్చితంగా నిర్ణయించింది.

అల్ హసన్ క్రీ.శ. 11వ శతాబ్దం, మధ్యప్రాచ్యం : అరబ్ భౌతిక శాస్త్రవేత్త. కాంతి పరావర్తన విస్తరణ సూత్రాలు.

సోమదేవుడు - క్రీ.శ. 12వ శతాబ్దం : మానసోల్లాస గ్రంథకర్త. పరిమళ ద్రవ్యాలు, సౌందర్యపోషకాల గురించి రాసిన గ్రంథం. (ఇదే కాలంలో గంధసారుడనే వ్యక్తి కూడా ఈ తరహాకు చెందిన గ్రంథాన్నే గంధ సారము అనే పేరిట రచించాడు.)

రసార్ణవ (T) రసరత్నాకర (T) క్రీ.శ. 13వ శతాబ్దం : రసవాద సిద్ధాంత గ్రంథాలు.

లియోనార్డో ఆఫ్ పీసా - 13వ శతాబ్దం - ఇటలీ : లైర్, అబాసీ గ్ర దశాంశ స్థానాలు : సున్నాతో సహా అరబిక్ అంకగణితా

